# Recalling the days of midnight knock

OFFICE OF THE DISTRICT MAGISTRATE, DELHI.

**ORDER**

WHEREAS I, Sushil Kumar, District Magistrate, Delhi, am satisfied that with a view to preventing the person known as Shri Jayaprakash Narayan who is currently residing at Gandhi Peace Foundation, Bause Avenue, New Delhi from acting in any manner prejudicial to the maintenance of public order, it is necessary to make an order directing that the said Shri Jayaprakash Narayan be detained.

Now, therefore, in exercise of the powers conferred by the clause (a) (II) of the sub-section (I) of Section 3 of the Maintenance of Internal Security Act, 1971 (26 of 1971). I hereby direct that the said Shri Jayaprakash Narayan be detained.

(SUSHIL KUMAR)
District Magistrate, Delhi.

Dated: 26-6-1975

# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think."*** **– Dammapada.**

సంపుటి 2 జులై 1992 సంచిక 36

## విషయసూచిక




విడిప్రతి రూ.4/- వార్షిక చందా రూ.50/-

ముఖచిత్రం
సత్యభామ
చిత్రకారుడు: మొక్కపాటి కృష్ణమూర్తి

4వ కవర్ : బాపు

Printed, Published and Edited by Shri ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C X Roads, Musheerabad, Hyd-20.

Ph. 612436, 612337. **Editorial NEST**

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Circus,** *n.* A place where horses, ponies and elephants are permitted to see men, women and children acting the fool.

**Clairvoyant,** *n.* A person, commonly a woman, who has the power of seeing that which is invisible to her patron-namely, that he is a blockhead.

**Clarionet,** *n.* An instrument of torture operated by a person with cotton in his ears. There are two instruments that are worse than a clarionet-two clarionets.

**Clergyman,** *n.* A man who undertakes the management of our spiritual affairs as a method of bettering his temporal ones.

**Clio,** *n.* One of the nine Muses. Clio's function was to preside over history-which she did with great dignity, many of the prominent citizens of Athens occupying seats on the platform, the meetings being addressed by Messrs. Xenophon, Herodotus and other popular speakers.

**Clock,** *n.* A machine of great moral value to man, allaying his concern for the future by reminding him what a lot of time remains to him.

A busy man complained one day:
"I get no time!" "What's that you say?"
Cried out his friend, a lazy quiz;
"You have, sir, all the time there is
There's plenty, too, and don't you doubt it -
We're never for an hour without it."

*Purzil Crofe.*

**Close-fisted,** *adj.* Unduly desirous of keeping that which many meritorious persons wish to obtain.

Said Jamie: "That is very true -
The boast requires no backing;
And all are worthy, sir, to you,
Who have what you are lacking."

*Anita M. Bobe.*

**Coenobite,** *n.* A man who piously shuts himself up to meditate upon the sin of wickedness; and to keep it fresh in his mind joins a brotherhood of awful examples.

O Coenobite, O coenobite,
Monastical gregarian,
You differ from the anchorite,
That solitudinarian:
With vollied prayers you wound Old Nick;
With dropping shots he makes him sick.

*Quincy Giles.*

**Comfort,** *n.* A state of mind produced by contemplation of a neighbor's uneasiness.

**Commendation,** *n.* The tribute that we pay to achievements -that resemble, but do not equal, our own.

**Commerce,** *n.* A kind of transaction in which A plunders from B the goods of C, and for compensation B picks the pocket of D of money belonging to E.

**Commonwealth,** *n.* An administrative entity operated by an incalculable multitude of political parasites, logically active but fortuitously efficient.

# జంతువు నుంచి మనిషి మనిషి నుంచి.....?

- ఎన్. వి. బ్రహ్మం

పరిణామ వాదం బహు ప్రాచీన మైనది. ప్రపంచం క్రమంగా మారుతున్నదని చాటే లుక్రీషియన్ పద్యంలో ప్రస్ఫుటమయ్యే ఎపిక్యూరస్ బుర్రలోనూ, 'ప్రతిదీ నిరంతర ప్రవాహంలో వున్నది; ఒకే నదిలో రెండు సార్లు అడుగు మోపటం అసంభవం' అన్న హెరాక్లిటస్ బుర్రలోనూ, ప్రపంచంలో ప్రతీదీ క్షణక్షణం మారుతూ వుంటుం దంటూ క్షణికవాదాన్ని ప్రతిపాదించిన గౌతమ బుద్ధుని బుర్రలోనూ-రెండున్నర వేల ఏళ్ళనాడే-పరిణామ వాద పాత్రిపదికలు లేక పోలేదు. జీవపరిణామవాద ప్రాతిపదికలు కూడ ప్రాచీన కాలంలో కనిపిస్తాయి. 500 జీవజాతుల్ని వర్గీకరించిన అరిస్టాటిల్ ప్రయోగాలు ఇందుకు తార్కాణం. హిందూ పురాణాలలోని దశావతార భావన కూడ ఏ జీవపరిణామ భావన ఆధారమూ లేకుండా వచ్చి వుండటానికి వీలులేదు. పుక్కిటి పురాణాల (Legends) మరుగున దాగి వుండే రూపకల్పనల (Myths) లో మానవజీవిత వాస్తవికత ప్రతిబింబిస్తూ వుంటుంది. ఈ యథార్థతను దృష్టిలో వుంచుకుంటే దశావతార భావన కేవలం పౌరాణికుల స్వకపోల కల్పనయే అనీ, దానికి వైజ్ఞానిక మైన అధారం వుండదనీ వివేకు లెవ్వరూ అనుకోరు. అయితే ప్రాచీన పరిణామవాదం తగిన లౌకిక సాక్ష్యాధారాలు సంతరించుకొని, తదను గుణంగా మారి, శాస్త్ర స్థాయి నందుకొన్నది ఇటీవలే. అందునా ఆధునిక జీవపరిణామవాదం వయస్సు రెండు శతాబ్దాల కన్నా వుండదు.

ముఖ్యంగా జీవపరిణామ పద్ధతులు రెండు: (1) రూపసవరణ పద్ధతి (Method of Modifications); (2) ప్రకృతి వరణ పద్ధతి (Method of Natural Selection). పరిణామం సరళరేఖాత్మకమైన అభివృద్ధిగా సాగుతుం దని చెప్పే సరళవిస్తరణ పద్ధతి (Orthogenesis) మరొకటి తలెత్తింది. కాని దాని ఫలితాలను ప్రకృతి వరణ పద్ధతి ద్వారా కూడా సాధించ వచ్చునని జూలియన్ హక్స్లీ, జె.బి.ఎస్.హాల్డేన్ వంటి ప్రముఖులు ప్రకటించారు. కాబట్టి దీనిని ప్రత్యేకంగా పేర్కొన వలసిన పని లేదు.

**రూపసవరణ పద్ధతి:** ఈ పద్ధతిని ఇరాస్మస్, డార్విన్ లాంటి వారు సూత్రప్రాయంగా ముందే ఊహించినా, దీని కొక రూపం కల్పించిన వాడు ఫ్రెంచి జీవ శాస్త్రజ్ఞుడు లామార్క్ (1744-1829). పరిసర వాతావరణ ప్రభావం వల్ల కానీ, అవయవాల ప్రయోగం వల్లకానీ ఒక జీవి యొక్క జీవితకాలంలో వచ్చే మార్పులు వారసత్వంగా సంక్రమిస్తాయనీ, ఈ మార్పులు కొన్ని తరాల పాటు కూడుకొన్న పిమ్మట స్థిరపడి పోతాయనీ లామార్క్ సిద్ధాంతం. అలా కూడు కొన్న లక్షణాలను సాధారణంగా ఆర్జిత లక్షణా (Acquired Characters) లనీ, రూపసవరణ లనీ అంటాం. ఎత్తుగా వున్న చెట్ల ఆకులు తినటానికి చేసిన ప్రయత్నంలో జిరాఫీ మెడ సాగిందన్నది దీనికి ప్రసిద్ధమైన ఉదాహరణంగా పేర్కొంటారు.

లామార్క్ వాదం దోషభూయిష్ట మనటానికి ఎన్నో దాఖలాలు చూపవచ్చు. ఉదాహరణకు-అతిశీతల ప్రాంతాలలో తావర మేర్పరచు కొన్న నల్లటి నీగ్రోలకు తెల్లటి పిల్లలు పుట్టటం లేదు. అత్యుష్ణ మండలాలకు తరలి వచ్చిన తెల్లవాళ్ళు, తాము కొంత నల్లకప్పు వేసినా అచ్చంగా తెల్లటి పిల్లల్నే కంటున్నారు. ఆర్జిత లక్షణాలు పారంపర్యంగా సంక్రమిస్తాయని లామార్క్ అడుగు జాడల్లో సిద్ధాంతాలు చేసిన మిచూరిన్లూ, దాన్ని ప్రయోగాలతో నిలబెట్టటానికి తంటాలు పడ్డ లైజెంకోలూ వేసినవి పిల్లి మొగ్గలే అని కూడా తేలిపోయింది.

**ప్రకృతి వరణ పద్ధతి:** దీనిని సహజ వరణ పద్ధతి అని కూడ అనవచ్చు. ముఖ్యంగా వారసత్వం (Heridity), వైవిధ్యం (Variation), జీవన సంఘర్షణ (Struggle for Existence) అనే మూడు వాస్తవాంశాలమీద ఆధారపడి బ్రిటిష్ జీవశాస్త్రజ్ఞుడు చార్లెస్ డార్విన్ (1809-1882) యీ పద్ధతిని ఆవిష్కరించాడు. డార్విన్ తో ఏ విధమైన సంబంధం లేకుండానే అదే సమయంలో ఇంచుమించు అదే రకమైన సిద్ధాంతాన్ని ఆల్ఫ్రెడ్ రస్సెల్ వాలెస్ కూడ రూపొందించటం విశేషం.

ఏ జీవజాతిని పరిశీలించినా పుట్టేబిడ్డ అవయవాలు తన తల్లిదండ్రుల అవయవాలను పోలివుండేట్లుగా పెరుగు తుంటాయని విశద మవుతుంది. ఇదే వారసత్వం.

అయితే బిడ్డ అవయవాలకూ తల్లిదండ్రుల అవయవాలకూ మధ్య పోలిక యెంతగా వున్నా అది సర్వ సమానం కాదనీ, ఎంతో కొంత తేడా వుంటుం దనీ కూడా మనకు తెలుసు. ఇదే వైవిధ్యం.

జీవులన్నీ భూమిమీద లభించే వనరుల దృష్ట్యా, జీవించటానికి వీలు లేనంత అధిక సంఖ్యాకంగా బిడ్డల్ని కంటాయి. అందు వల్ల ప్రతి జీవజాతిలో వ్యక్తుల మధ్య బతుకు కోసం పోటీ తప్పనిసరి అవుతుంది. ఈ పోరాటం బుద్ధి పూర్వకం కానవసరం లేదు. ఇదే జీవన సంఘర్షణ. (జీవన సంఘర్షణ బుద్ధి పూర్వకమైతే స్వేచ్ఛ (Freedom) అవుతుంది. మానవజాతికిది ప్రత్యేకత అనవచ్చు).

ఈ జీవన సంఘర్షణలో తమకు సాయపడగల వైవిధ్యాలు కొన్ని వ్యక్తిగత జీవులలో పెరుగుతాయి; అలాంటి జీవులు జీవిస్తాయి; అలా సాయపడని వైవిధ్యాలు పెంచుకొన్న జీవులు నశిస్తాయి. జీవించిన జీవులు తమజాతి పునరుత్పత్తికి తోడ్పడతాయి; పునరుత్పత్తి అయిన జీవులు వారసత్వనియమాన్ని అనుసరించి తమ తల్లిదండ్రులను పోలి పెరుగుతాయి. అంటే మనుగడకు అనువైన వైరుధ్యాలను సంగ్రహించటానికి మాత్రమే అవి ప్రయత్నిస్తాయన్న మాట. ఈ పరిణామక్రమాన్నే డార్విన్ ప్రకృతి వరణ పద్ధతి అన్నాడు.

డార్విన్ అనంతరం పెరిగిన జీవశాస్త్ర పరిజ్ఞానాన్ని పరిగణన లోనికి తీసుకుంటే ఆయన వైవిధ్య సూత్రాన్ని ఇలా చెప్పుకోవచ్చు: జంతువు లన్నీ బారుకూ మారుతూనే వస్తున్నాయి; ఈ వైవిధ్యం ప్రతి అవయవంలోనూ జరుగుతూనే వున్నది. దీనిలో అధిక భాగం భిన్న పరిసరాల వల్ల కలిగే రూపసవరణల ననుసరించి వుంటుంది, కాని ఇది వారసత్వంగా సంక్రమించదు. అయితే యీ వైవిధ్యంలో అల్పభాగం జీవిలోని ప్రతిభాగాన్నీ ప్రభావితం చేయగల ఉత్పరివర్తనం (Mutation) గా వుంటుంది; ఇది వారసత్వంగా సంక్రమిస్తుంది. ప్రతి జీవజాతిలోనూ ఈ ఉత్పరి వర్తనాలెన్నో ఇప్పటికీ ఉనికిలో వున్నాయి; కొత్తవి ఎప్పుడూ ఉత్పన్న మవుతూనే వుంటాయి.

**పరిణామం పడే పొరపాట్లు:** అయితే అనుకూల వైవిధ్యాలు పొంది విజయ మందుకొన్న జీవులు తమ జాతిలో స్థిరమైన సవరణగా పరిమాణాత్మక మైన మార్పు పొందుతాయనీ, అంతిమంగా అలాంటి మార్పును ఉత్పన్నం చేసే ఒకానొక ప్రకృతి క్రమంవల్ల ఈ జీవులు ఎంపిక అవుతాయనీ, ఇదంతా పరిసరాలకు అనుకూలంగా మారుతూ తమ జాతిని పెంపొందించుకో గలందులకే జరుగుతుందనీ పరిణామవాదం ఘోషిస్తున్నది. అయితే యీ మార్పులకు దోహద మవుతూ జీవయంత్రాంగంలో దాగివున్న గుణదోషాలను గురించి కానీ, జీవి సున్నితంగా ప్రదర్శించే అనుకూలతా ప్రతికూలతలను గురించి కానీ ఈ ఘోషలో అణుమాత్రం కూడ వివరణ కనపడదు. ఏది ఎప్పుడు ఎలా జరుగుతుందో ఎవరికీ తెలియదు. జరిగిన తర్వాత తెలియాల్సిందే. ఆ మేరకు జీవపరిణామవాదం ఇంకా ముందంజ వేసి శాస్త్రీయ విలువను సంతరించుకో వలసి వుంది.

అంతే కాదు. ప్రకృతి వరణ పద్ధతికి పిగలకుండా తర్కానికి అందకుండా శాస్త్రజ్ఞుల్ని కలవర పరుస్తున్న అంశాలు కొన్ని వున్నాయి. పారదర్శక మైన కంటి పొరనూ సీతాకోకచిలుక వంటి కీటకాల జీవిత దశలనూ ఉదాహరించకోవచ్చు.

కంటిపొర ప్రకృతివరణ ప్రాతిపదిక మీద క్రమాభివృద్ధిగా మారుతూ వచ్చి వుండటానికి వీలు లేదు. దానితో చూడగలగటమో చూడ లేక పోవటమో ఏదోఒకటి జరగాలి. చూడలేనివి చూడగలిగే వాటికి ఆహారమైపోవటం సహజం కాబట్టి వాటి కంటి పొర చూడ గలిగే దశకు నెమ్మదిగా పరిణామం చెందిందాకా అవి బతకవు. అందువల్ల వెన్నెముక గలజీవుల్లో హఠాత్తుగా వచ్చిన పారదర్శక నేత్రపటలం యొక్క పరిపూర్ణత ప్రకృతివరణ చట్రంలో ఇమడదు. దాని ప్రాదుర్భావం ఎలా సంభవ మయిందా అన్న ఆలోచన తనకు వెన్నెముక వెంబడి చలిపులకలు కలిగించి కంగారు పరిచిందని డార్విన్ చెప్పుకున్నాడు.

అలాగే కొన్ని కీటకాల జీవితచక్రాలు పరిశీలిస్తే- వాటిలో అంతటి క్రమబద్ధతను కల్పించే సహజాత వాసన ఆవిర్భావం ఎలా సాధ్యమయిందో అర్థం కాదని కూడ డార్విన్ ఆందోళన వ్యక్తపరిచాడు. వ్యాకరణ విరుద్ధమైన పదప్రయోగాలను శబ్దపల్లవాలన్నట్లు - ఇలాంటి అర్థంకాని ధోరణులను 'పరిణామంలో దొర్లిన పొరపాట్లు'గా వర్ణించి వదిలారు కొందరు జీవశాస్త్రజ్ఞులు. శాస్త్రజ్ఞానాని కందని ప్రకృతి మర్మాలెప్పుడూ వుంటాయని గుర్తించలేని లోపం వారిది.

**పరిణామవాద తాత్విక ఫలితాలు:** డార్విన్ సిద్ధాంతాన్నీ ఆయన అనంతరం జీవశాస్త్రాలలో వచ్చిన ప్రగతినీ దృష్టిలో వుంచుకుంటే కొన్ని తాత్విక ఫలితాలను రాబట్ట వచ్చు. వీటిలో కొన్ని ప్రత్యక్షమైనవి కాగా కొన్ని పరోక్షమైనవి.

(1) దేవుడు హాంఫట్ అనగానే శూన్యం నుంచి ఆకస్మికంగా యావత్తు సృష్టి జరిగిందనో, లేక క్రీస్తు పూర్వం 4004 సంవత్సరాల నాడు ఒకానొక శుభముహూర్తాన ఆరంభించి తీరుబడిగా ఆరురోజులపాటు సృష్టిసాగించాడనో చెప్పే మతాలు డార్విన్ పరిణామవాదం కొట్టిన దెబ్బకు దిమ్మ తిరిగి పోయినై. న్యూటన్ చలన సూత్రాలతో యంత్రసదృశమైపోయిన భౌతిక ప్రపంచం నుంచి పలాయనమై జీవప్రపంచంలో తలదాచుకోటానికి వచ్చిన దేవుడికి అక్కడ కూడ నిలువ నీడ లేకుండా చేశాడు డార్విన్. అందుకు తగిన శిక్ష అనుభవించాడు 'దేవుడి బిడ్డల' చేతుల్లో. మానవుని తాత్విక చింతన మీదా సామాజిక ప్రగతి మీదా డార్విన్ సిద్ధాంత ప్రభావ మెంతటిదో దీనివల్ల అవగత మవుతుంది.

(2) లామార్క్ విధానంలో జీవజాతుల పరిణామం మీద పరిసరాల ప్రభావం ప్రత్యక్షంగా వుంటుంది. డార్విన్ విధానంలో పరిసరాల పరోక్ష ప్రభావం మాత్రమే పరిణామ క్రమంమీద పనిచేస్తుంది. జీవపరిణామానికిబాహ్యమైనరూపసవరణలుముఖ్యమనిలామార్క్ భావించగా-అంతర్గత మైన ఉత్పరివర్తనాలు మూలమని డార్విన్ పరిగణించాడు. కాబట్టి పరిణామానికి ప్రధాన కారణం లామార్క్ సిద్ధాంతంలో బాహ్యస్థితం కాగా డార్విన్ సిద్ధాంతంలో అంతర్గతం.

కార్యకారణ సంబంధంగా ఆధునిక తత్వశాస్త్రం అంతర్గత కారణాన్నే ప్రధాన కారణంగా సమర్థిస్తుంది. అంతర్గత కారణం యొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించ లేక బాహ్యకారణాన్ని పట్టు కొని పాకులాడటం వల్లనే మన ప్రాచీనులు విశ్వాతీతశక్తిగా దేవుణ్ణొకణ్ణి పుట్టించారు. డార్విన్ సిద్ధాంతం ప్రకారం పరిణామ హేతువు బహ్యస్థితం కాదు; అంతర్గతం. బాహ్యపరిస్థితులు పరోక్షంగా దోహదం కావచ్చు కాని, ప్రత్యక్షమైన ప్రధాన ప్రేరణ అంతర్గతంగా మాత్రమే వుంటుంది. కాబట్టి బాహ్యకారణాల దోహదస్థితిని మాత్రమే గుర్తించి అంతర్గత కారణం యొక్క ప్రాధాన్యతను బలపరచటం వల్ల డార్విన్ పరిణామ వాదం ఆధునిక తత్త్వజ్ఞానంతో చేతులు కలపగలిగింది.

(3) డార్విన్ సిద్ధాంతం ప్రకారం ప్రకృతివరణం రెండంశాల మీద ఆధారపడి వుంది. అందులో ఒకటి-ఏ ప్రత్యేక జీవజాతిని తీసుకొన్నా దానిలోని జీవులలో వైవిధ్యం గోచరిస్తుం దన్న వాస్తవాంశం. రెండోది-వైవిధ్యాన్ని ప్రదర్శించే యీ జీవులలో కొన్ని హతం కాగా మిగతావి బతుకుతా యన్న ఊహ. ఒకే సముదాయంలో ఏ రెండు జీవుల్ని తీసుకున్నా వాటి మధ్య వైవిధ్యం వుంటుం దన్న వాస్తవం వ్యక్తివాదాన్ని సమర్థిస్తుంది. మానవ సమాజంలో కూడ ఏ ఇద్దరు మనుషులూ ఒకటి కాదు. వారి మధ్య వైవిధ్యం వాస్తవం; అంటే వ్యక్తిత్వం వాస్తవం. కాబట్టి డార్విన్ సిద్ధాంతం దృష్ట్యా వ్యక్తుల సహకార సమాఖ్యగా తప్ప సమాజానికి అర్థమూ లేదు; ఉనికీ లేదు. మానవజీవితం లోని వ్యక్తివాదానికి పునాది జంతు జీవితం లోనే వున్న దన్న మాట. దీనిని బట్టి వ్యష్టివాదమే సహేతుక మనీ వ్యష్టిని పరిహరించే ఏ సమష్టివాదమైనా నిర్హేతుక మనీ తేలు తున్నది. అలా డార్విన్ సిద్ధాంతం ప్రజా స్వామ్య భావానికీ మానవ వాదానికీ శాస్త్రీయమైన రుజువుగా రూపొందింది.

(4) వ్యక్తి వృద్ధిలో జాతివృద్ధి పునరావృత మవుతుంది (Ontogeny repeats phylogeny) అని నేడు జీవశాస్త్ర విద్యార్థులందరికీ తెలిసినదే. జంతువుకానీ మనిషికానీ పిండరూపంలో వున్నప్పుడు తనకు పూర్వం గతించిన జీవపరిణామ దశలన్నిటినీ జీవిస్తు న్నట్లు ప్రయోగాత్మకంగా రుజువయింది. పదవ రోజు వరకు వివిధ జీవరాశుల పిండాలన్నీ వేరు పరచరానంత సర్వసమానంగా కనిపిస్తున్నాయి. తర్వాతనే వాటిలో తమకు సహజమైన జీవపరిణామ దశలు వరుసగా గోచరిస్తున్నాయి. కాబట్టి జీవపరిణామ క్రమంలోని జాతిజీవి తాన్ని మొత్తాన్ని జీవించి కొన్ని వైవిధ్యాలతో అవతరించిన వ్యక్తి కన్న జాతి మిన్న కాజాలదు. జాతి వ్యక్తిలో నిక్షిప్తమైవుంది. కనుక వ్యక్తే జాతికి ప్రతినిధి. జాతికోసం ఆజాతిలోని వ్యక్తులంతా త్యాగం చెయ్యాలని బోధించే జాతీయవాదం ఆ త్యాగ ఫలాలను హరించటానికి కాచుకొని వున్న కొందరు వ్యక్తుల స్వార్థానికి మాత్రమే సాయపడుతుంది. అందుకే మన 'జాతీయ' కవి రవీంద్రనాథ్ టాగూర్ జాతీయ వాదాన్ని సంఘటిత స్వార్థం (Organized

selfishness) అన్నాడు. కాబట్టి ఏ కోణంనుంచి చూచినా జీవపరిణామవాదం వ్యష్టిప్రధాన వాదాన్ని తప్ప ఏరకమైన సమష్టి వాదాన్నీ సమర్థించదు.

(5) పరిణామహేతువు అంతర్గతం కావటం వల్ల పరిణామం లోపల నుంచి వెలుపలకే కాని వెలుపలనుంచి లోపలకు విస్తరించదు. విత్తనంలోని సూక్ష్మజీవకణం పెరిగి పిల్లగా వెలువడు తుంది. అండ బీజాల కలయికగా ఏర్పడ్డ పిండం పెరిగేకొద్దీ వివిధ అంగాలు బయటికి పొటమరిల్లుతాయి. కేంద్రమైన మానవుని మానసిక జగత్తుకు ప్రతిచ్ఛాయయేమో అన్నట్లు దానికి సమాంతరంగా బాహ్యమైన సామాజిక ప్రగతి సంభవిస్తుంది. రోగిలోని నిరోధక శక్తి లోపమే బాహ్యమైన క్రిమి సముదాయాన్ని ఆహ్వానించి వ్యాధిగా రూపొందు తుంది. పరిణామం సూక్ష్మమైన కేంద్రం నుంచి స్థూలమైన బాహ్యానికి సాగుతున్నది. విశ్వవిస్తరణను కూడ ఈ భౌతిక వాస్తవికతకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. పై వాస్తవాంశాల న్నిటి వెనక దాగివున్న పరిణామవాదం వ్యక్తిని కేంద్రంగా పరిగణించే మానవవాద-ప్రజాస్వామ్య భావనలకే పాలుపోస్తుంది. స్థూలానికి మూలం సూక్ష్మమన్న విభావన విప్లవాత్మక మైనది కదా!

(6) జీవపరిణామానికి మూలకారణం జీవిలో వున్నట్లే విశ్వపరిణామానికి మూలకారణం కూడ విశ్వం లోనే వుండాలి. ఒకప్పుడు మనిషి లేడు; అంతకు ముందు జంతువు లేదు; దానికి ముందు 'జీవమే' లేదు. ఉన్నదేదో అది మొత్తానికి భౌతిక వాస్తవ మైనదంటున్నారు. ఐన్‌స్టైన్ పరిభాషలో దానిని పదార్థ-శక్తి (Matter-Energy), లేదా శక్తి-పదార్థం (Energy-Matter) అనవచ్చు. పదార్థం, శక్తి అనేవి ఒకే సత్తు(Being) యొక్క రెండు రూపాలు. పదార్థ మంటే సంకుచిత శక్తి(Contracted Energy) . శక్తి అంటే వ్యాకుచిత పదార్థం(Expanded Matter). కనుక యథార్థంగా వున్నది కేవల పదార్థమూ కాదు; కేవల శక్తీ కాదు. ఇందులో పదార్థం సత్తుయొక్క నిద్రావస్థను సూచించే జడరూపం; శక్తి సత్తు యొక్క జాగ్రదవస్థను సూచించే చేతన రూపం. మార్పు లేదా పరిణామం అన్నది చైతన్య క్రియకాని జడప్రవృత్తి కాదు. కాబట్టి సహేతుకంగా యోచిస్తే 'పదార్థ పరిణామం' అనే పదసమాసమే తప్పు కావాలి. పరిణమించ గలిగేది చేతన శక్తికాని జడపదార్థం కాజాలదు. పరిణామ క్రమంలో జడత్వాని కంటే చేతనత్వానికి విలువ ఇవ్వటంలోనే అర్థం వుంటుంది. కనుక మనకు ఆమోదయోగ్యం కాదగింది శక్తివాదం కాని పదార్థవాదం కాదు. శక్తివాదమైతే జీవభావాదులకు పరిణామ క్రమంలో సముచితస్థానం సమకూరుతుంది. పైగా పదార్థవాద మనగానే అత్యధిక సంఖ్యాకులు అదొక 'మొద్దు' వాదమనుకొంటున్నారు. దోషం వాళ్ళ అలోచనలో ఉన్న దనుకొనే కన్నా పదప్రయోగం లోనే ఉన్నదనుకోవటం సమంజసం. అయినప్పుడు పదబంధంలో చిక్కుకొని పరితపించే కంటె ప్రయోగార్హ మైన పదాన్ని వెదకటం మంచిది.

పదార్థమూ శక్తీ ఒకే సత్తు యొక్క భిన్న రూపాలుగా ఐన్‌స్టైన్ ప్రకటించి నట్లే -పదార్థమూ మనస్సూ కూడా ఒకే వాస్తవికత యొక్క భిన్నరూపాలే అని జూలియన్ హక్స్‌లీ అంటాడు. పరిణామక్రమంలో ప్రస్ఫుటాలైన జీవం, మనస్సు వంటి విశిష్ట ప్రవృత్తులు జడపదార్థ విలాసాలనుకోవటం కంటె చేతనశక్తి వికాసా లనుకోవటం వివేకం కదా?

(7) నిర్జీవ జగత్తు నుంచి జీవజగత్తు, జీవజగత్తు నుంచి జంతుజగత్తు, జంతుజగత్తు నుంచి మానవ జగత్తు ఆవిర్భవించినట్లు పరిణామవాదం ప్రకటిస్తుంది. వ్యక్త మయ్యే దంతా గుప్తంగా వున్నదే; గుప్తం కాని దేదీ వ్యక్తం కాదు; గుప్తంగా వున్నదే వ్యక్తమవుతూ

వ్యాప్తమవుతుంది. అందువల్ల ఈ నాటికి పరిణామ శిఖరాన్ని చేరుకున్నట్లు భావింపబడుతున్న మానవునికి ప్రత్యేకతగా వున్న మనస్సు గుప్తస్థితిలో జంతు జగత్తులోను జీవజగత్తులోను, నిర్జీవ జగత్తు లోను వుండితీరాలి. అలాగే జీవం కూడ నిర్జీవ జగత్తులో దాగి వుండాలి. అలా జీవం, మనస్సు అనేవి గుప్తశక్తి యొక్క వికాసాలుగా భావించుకోక పోతే-అవి మధ్యలో ఆకాశం నుంచి ఊడి పడ్డాయనుకో వలసి వస్తుంది. అప్పుడది మతవాద మవుతుందికాని హేతువాదం కాదు. ఈ శక్తివాద భావన భౌతిక వాది, మానవవాది అయిన హక్స్‌లీ భావనకు అనుగుణమైనదై చాల సమస్యలకు ఉత్తమ పరిష్కారసాధనంగా సాయపడుతుంది.

(8) పరిణామక్రమంలో మానవధర్మాల వైపు మొగ్గుదల జంతు ప్రకృతి లోనే కనిపిస్తుంది. మనస్సు క్రమాధికంగా విముక్తి పొందుతూ వికసించట మొక్కటే జీవపరిణామంలో గోచరించే వాస్తవా లన్నిటిలో గొప్ప వాస్తవం. దేహ బలం కంటె మనోబలం కల జంతువులు బాగా రాణిస్తూ వచ్చాయి. అయితే జీవపరిణామ ప్రభావం కొంత ఇప్పుడు కూడ మనిషిలో పనిచేస్తూనేవున్నది. మనలో కోతులూ కొండ ముచ్చులూ పెద్దపులులూ పెనుపాములూ దాగి వున్నాయి. అవి మరణించాలని మనమెప్పుడూ కోరుకో వలసిందే. అదే సమయంలో మానవపూర్వదశ నుంచి మనకు సంక్రమించి, మన మనుగడకూ అభ్యుదయానికీ దోహద పడుతున్న జంతు వారసత్వాన్ని గుర్తించ లేకుండా వున్నాం. మానవుని విశిష్టతకు మూలం జంతు దశలో నిక్షిప్తమైవుంది. గతమైన జీవదశలను గర్భస్థ దశలో జీవించి, ప్రస్తుత మైన మానవదశను జీవిస్తున్న మానవునిలో జంతుదశకు సంబంధించిన ముద్రలు సహజంగానే వుంటాయి. ఎప్పుడైనా ఎక్కడైనా వున్నది వికసిస్తుందే కాని, లేనిది అవతరించదు. అయితే యాంత్రికంగా సాగే వికాసాన్ని కొంత బుద్ధి పూర్వకంగా సాధించటం లోనే మానవునికి చరితార్థత సిద్ధిస్తుంది.

(9) జంతు లక్షణాలలో అనంతరదశ అయిన మానవ లక్షణాలు నిక్షిప్తమై వున్న వనుకొన్నప్పుడు-మానవ లక్షణాలలో మానవానంతరదశ లక్షణాలు నిక్షిప్తమై వుంటాయనుకోటానికి అక్షేపణ ఉండ వలసిన పని లేదు. అలాంటి దశను పట్టివ్వగల ఒక కొత్త పదాన్ని వెదకటం అవసరం. అది పరిణామగతిని త్వరితపరచటానికి తోడ్పడ వచ్చు. మనిషి తన అనంతర ఉత్తమదశను తరచుగా స్ఫురణకు తెచ్చుకొంటూ ఫలానా వైపు పయనిస్తున్నాను....ఫలానవైపు పయనిస్తున్నాను....అని మాటిమాటికి మననం చేసుకుంటూ వుంటే నైతికమైన తన ప్రవర్తనా రంగం లో అనుకూల మైన సుపరిణామాలు రావటానికి వీలుంది. అలాకాక జంతువునుంచి వచ్చాను.... జంతువు నుంచి వచ్చాను.... అని జపం చేసుకొంటూ కూర్చుంటే ప్రతికూలమైన విపరిణామాలే కాలు పూనతొక్కు కుంటాయి. ఇంతవరకు సాగుతూ వస్తున్న పరిణామ వాద పారాయణంతో ఎక్కువగా భ్రమరకీటక న్యాయమే జరుగుతూ వచ్చింది. దీనికి మార్గాంతరం వెదకటం తక్షణ కర్తవ్యం.

**(10) నిర్జీవ దశ నుంచి సాగుతూవచ్చిన పరిణామక్రమం మానవునితో ఆగటానికి వీలుందా? అయితే తర్వాతి దశనే మనవచ్చు?**

**రెండు వందల కోట్ల ఏళ్ళ పరిధికి విస్తరించి వున్న జీవపరిణామం వెలుగులో మానవుణ్ణి పరిశీలించ వలసిందే. కాదనం. కాని మానవావిర్భావంతో జీవపరిణామం స్తంభించి పోయిందనుకోవటం అవివేకం. అలాంటప్పుడు మానవానంతరదశకు సంబంధించిన ఊహలకూ ఊహాకల్పనలకూ ఉపక్రమించటం అనుచితం కాదు. ప్రకృతి ప్రస్తుత మానవునిలో తనకొక**

విశిష్ట గౌరవాన్ని దర్శించుకొంటూ వున్నదనే జీవశాస్త్ర వేత్తలతో తగాదా పడవలసిన పనిలేదు. అయితే అంతటి ఉన్నతస్థాయికి చేరినట్లు కనిపించే మానవుని వెలుగులో జీవపరిణామాన్ని దర్శించవలసిన అవసరం కూడా మనకెంతో వుంది. అలా దర్శింపదలచిన వారికి సత్య-శివ-సుందరాత్మకమూ, సత్-చిత్-ఆనంద రూపకమూ అయిన మానవోత్తర దశ లీలగానయినా గోచరం కాకపోదు. అరవిందుడు ఆవిష్కరించిన అతీతమానవదశ ఇంచుమించు ఇలాంటిదే. దానికి దైవత్వం (Divinity) అనే పర్యాయ పదాన్ని ఆయన ప్రయోగించి వుండవచ్చు. విశ్వం స్వయం సమగ్రమై ఏది జరిగినా విశ్వంలోనే జరుగుతుందన్న ఏకతా వాదాన్ని ఆమోదిస్తే-మనిషిలో దైవత్వం వికసిస్తున్న దన్నా, ప్రకృతి పరిణామంలోనూ జీవపరిణామం లోనూ దైవత్వ శక్తి వికసిస్తూ వస్తున్న దన్నా బెదిరి పోవలసిన పని లేదు. మానవుడు విశిష్ట జంతువైతే దైవం విశిష్టమానవుడు. ఇలా 'ఉత్తమ మానవ' లేక 'పురషోత్తమ' అనే అర్థంలో దైవ శబ్దాన్ని ప్రయోగించిన విజ్ఞుల నిజాయితీని శంకించటంలో అర్థం లేదు.

అయితే మత ప్రభావం వల్ల దైవ శబ్దాని కంటుకొన్న బురదను కడిగి వేయటం-ముఖ్యంగా పామరలోకాన్నలా వుంచి, పండితలోకంలోనైనా మానవోత్తర దశకు ప్రాతినిధ్యం వహించే విధంగా దైవశబ్దాన్ని ప్రయోగించటం-సాధ్యమను కుంటే ఆ పదాన్ని స్వీకరించ వచ్చు. కాదనుకుంటే అపార్థాలకు తావివ్వని ఏదో నూతన పదాన్ని అన్వేషించటం అవశ్య కర్తవ్యం. ఆ పదం పరిపూర్ణ మానవునికి ప్రాతినిధ్యం వహించేదిగా వుండాలి. అయితే ఒక విషయం విస్మరించ కూడదు. ఎంతో విజ్ఞతతో భాషార్థ పరిజ్ఞానంతో పూర్వులు స్థిరపరిచిన సాంకేతిక పదజాలాన్ని తృణీకరించబోయే ముందు సావధాన చిత్తత, పూర్వాపరజ్ఞానం, సదసద్వివేకం మననుంచి విడివడకుండా చూచుకోవాలి. దేనినైనా పరిమార్చటం తేలిక; సమకూర్చటం కష్టం. మంచి మాటల విషయంలో ఇది మరీ అక్షర సత్యం.

డార్విన్ ఆవిష్కరించిన జీవపరిణామ నేపథ్యంలో మానవ పరిణామాన్ని పరిశీలింపబూనితే-ఈ ఆలోచనలు అప్రస్తుతాలు కావు. కాని తమాషాయేమంటే మున్నం జరిగిన దాన్ని గురించి ఎంతగా పట్టించు కుంటామో అంతగా జరుగు తున్న దాన్ని గురించి పట్టించుకోము. ఇక జరగ బోయేదాన్ని గురించి అంటారా సరేసరి. ఈ వాస్తవం దేనికి వర్తించినా వర్తించక పోయినా, జీవపరిణామ వాదం విషయంలో అక్షరాలా వర్తిస్తుంది. ★

# Rich v/s Poor

| America | India |
|---|---|
| **5%** of the world's population.... | **16%** of the world's population.... |
| **25%** of the world's energy | **3%** of the world's energy |
| Emits **22%** of all $CO_2$ produced and accounted for | Emits **3%** of all $CO_2$ produced and accounted for |
| **22%** of the world's GNP | **1%** of the world's GNP |

# వ్యక్తి స్వాతంత్ర్యం సమాజ శ్రేయస్సు

గత సంచిక తరువాయి
(రెండవ భాగం)

రాచమల్లు
రామచంద్రారెడ్డి

ప్రకృతినుండి స్వాతంత్ర్యం అన్నప్పుడు ప్రకృతి నియమాలకు లోబడకుండా వుండే స్వాతంత్ర్యంకాదు - ప్రకృతి నియమాలను తెలుసుకొని, మనకు అనుకూలంగా వాడుకోవడం. అట్లే ఇచ్ఛా స్వాతంత్ర్యం అంటే ఇచ్ఛ యెందుకు, యే విధంగా, యే కారణాలవల్ల కలిగేది తెలుసుకొని ఇచ్ఛకూ, ఇచ్ఛను కలిగించే కారణాలకూ గల సంబంధ బాంధవ్యాలను తెలుసుకొని తత్సంబంధమైన మనశ్శాస్త్రం తెలుసుకొని మానవుడు తనకు కలిగే ఇచ్ఛను తాను అదుపులో పెట్టుకోవచ్చు. అంటే ప్రతివ్యక్తీ తనకు కలగవలసిన ఇచ్ఛను యిపుడే నిర్ణయించుకొని ఆ యిచ్ఛ తమకు కలిగేటట్లు చేసుకోవచ్చు. వ్యక్తికి కూడా ఇట్టి స్వాతంత్ర్యం కొంత వుంది. ఒక ఇచ్ఛను కలిగేటట్లు చేసుకున్నట్లే కలగకుండా కూడా చేసుకోవచ్చు.

వ్యాపారస్తులు తమ సరకులను అడ్వర్టైజుమెంటు చేసుకోవడం యెందుకు? తమ సరకులను కొనాలన్న యిచ్ఛను ప్రజలలో కల్గించడానికి చేసే ప్రయత్నమే అది. డబ్బు సంచులన్నీ మగవాళ్ళ చేతిలోవున్న మన నాగరికతలో అందమైన ఆడవాళ్ళ బొమ్మలు అడ్వర్టైజ్‌మెంట్లలో అత్యధికంగా వుండడం పెట్టుబడిదార్ల చేతిలో మనోవిజ్ఞానం సద్వినియోగం కావడమే.

విప్లవ సాహిత్యం వ్రాయాలనేదెందుకు? ఆ సాహిత్యం చదివే ప్రజలలో విప్లవేచ్ఛ కలుగుతుందనే. ప్రభుత్వాలు విప్లవ సాహిత్యాన్ని బహిష్కరించేది కూడ ఆభయంతోనే.

ఆ ఇచ్ఛను అడ్వర్టైజుమెంటు ఒక్కటే కలిగిస్తుందనికాదు, సాహిత్యం ఒక్కటే కలిగిస్తుందని కాదు. అనేక కారణాలలో అదీ ఒకటి అని.

ఈ విధంగా ప్రజల యిచ్ఛను కంట్రోల్ చేయడం సాధ్యం కనుకనే హిట్లరు జర్మన్ ప్రజలలో జాత్యహంకారాన్ని రెచ్చగొట్టగల్గినాడు.

సొంత ఆస్తినీ, ఆర్థిక అసమత్వాన్నీ నిర్మూలించి, శరీరశ్రమ, మేధాశ్రమ అను శ్రమ విభజనను తుదముట్టించి, మనిషిలో స్వార్థం అనేది లేకుండా చేయవచ్చుననడం భవిష్యత్ మానవుని యిచ్ఛను (స్వార్థం అనే గుణానికి సంబంధించినంతవరకు) ఈనాడు మనమే నిర్ణయించవచ్చు ననడమే.

నియంతృత్వ ప్రభుత్వాలు పిల్లల పెంపకాన్ని లోబరచుకొని, వాళ్ళ సర్వ యిచ్ఛలను కంట్రోల్ చేసి, భయంకరమైన బానిసల సమాజాన్ని సృష్టించవచ్చునని Brave New world (ధీర నవ్యప్రపంచం) అనే పుస్తకంలో ఆల్డస్ హక్స్లీ చిత్రించడం మనశ్శాస్త్ర సూత్రాల ఆధారం మీదనే.

ఈ విధంగా యిచ్ఛా స్వాతంత్ర్యం అంటే ఇచ్ఛ యాంత్రికంగా కలిగేదశ గడిచి, మానవ శ్రేయస్సుకు అనుకూలమైన ఇచ్ఛలు మాత్రమే మానవులలో కలిగేటట్లూ, ప్రతికూలమైన ఇచ్ఛలు కలగకుండావుండేటట్లు చేసుకొనే శక్తి మానవునికి వుండడమే అని తేలింది. ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలోనూ విద్య, క్రీడ, సాహిత్య, కళారంగాలలోనూ గృహము, పాఠశాల, కర్మాగారము, వ్యవసాయ క్షేత్రము మొదలైన రంగాలలోనూ తగిన మార్పులుచేసి మానవునిలో దుష్ట ఇచ్ఛలు, దురుద్దేశాలు కలుగకుండా చేయవచ్చు. ఈ స్వాతంత్ర్యానికి కూడా మూలం ఆవశ్యకతను గుర్తించడమే.

(ఆవశ్యకతను గుర్తించడమే స్వాతంత్ర్యం అన్న సూత్రానికి సంబంధించినంతవరకే పై వివరణ యివ్వబడినది. ఆ వివరణ ఇచ్ఛా స్వాతంత్ర్య సమస్యకు సంపూర్ణ సమాధానం కాదు. తక్కిన ఇచ్ఛ యిక్కడ అప్రస్తుతం).

**ఆర్థిక సాంఘిక రాజకీయరంగాల్లో :** ఆవశ్యకతను లేక నియమాలను గుర్తించడమే స్వాతంత్ర్యం అనే సూత్రం ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలకుకూడా వర్తిస్తుంది. చరిత్రలో ఏ ఆర్థిక సాంఘిక రాజకీయ పరిస్థితీ అకారణంగాకాని, యాదృచ్ఛికంగాకాని, కాకతాళీయంగా కాని ఏర్పడిందికాదు. ప్రతిదానికీ నిర్దిష్టమైన కారణాలు వున్నాయి. మానవుని ఆర్థిక సాంఘిక రాజకీయ పరిణామాలను నిర్ణయించే శాస్త్రమే చారిత్రక భౌతికవాదం. ఈ శాస్త్రాన్ని అభ్యసించి, ఆ నియమాలను గుర్తించి అనుసరించి, మానవుడు తాను కోరిన ఆర్థిక సాంఘిక రాజకీయ వ్యవస్థలను సృష్టించుకొని, ఆర్థిక సాంఘిక రాజకీయ నిర్బంధాలనుండి స్వతంత్రుడౌతాడు. మానవుడు అంటే సర్వ మానవజాతి అని అర్థం.

వర్గ సమాజంలో మానవుడు ఆర్థికంగా సాంఘికంగా రాజకీయంగా అస్వతంత్రుడు అంటే యేమిటి? కొన్నివర్గాలు ఒక వర్గానికి దాస్యం చేస్తూ వుంటాయి అని మాత్రమే కాదు. కొన్నివర్గాలు ఆర్థిక సాంఘిక రాజకీయ దాస్యం అనుభవిస్తే తప్ప ఆనాటి మానవజాతి యొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయ అవసరాలు తీరవని అర్థం. బానిస సమాజంలో కొందరు బానిసలుగా వుంటే తప్ప ఆనాటి మానవుల సమిష్టి అవసరాలు తీరవని అర్థం. బానిసలు లేకపోయినా అవసరాలు తీరే అవకాశంవుండి, కేవలం పాలకవర్గాల దుర్మార్గం వల్లనే కొందరు వ్యక్తులు బానిసలుగా వుండినట్లయితే, అప్పుడు కొందరు వ్యక్తులు అస్వతంత్రులు అని అనవచ్చునేకాని, మానవుడు అస్వతంత్రుడు అని అనలేము. బానిసయుగంలోకంటె జమీందారీ యుగంలోనూ, జమీందారీ యుగంలోకంటె పెట్టుబడిదారీ యుగంలోనూ, పెట్టుబడిదారీ యుగంలోకంటె సోషలిస్టు యుగంలోనూ మానవుడు ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా ఎక్కువ స్వతంత్రుడు అనేది ఈ అర్థంలోనే. ఒక యుగంలోకంటె తరువాత యుగంలో స్వాతంత్ర్యం పెరిగేది పాలిత వర్గాలకే. లేదా ఒక యుగంలోని పాలిత వర్గాలు అనుభవించినంత పారతంత్ర్యం తరువాత యుగంలోని పాలిత వర్గాలు అనుభవించవలసిన ఆవశ్యకతలేదు. కాబట్టి, మానవజాతికే ఆ ఆవశ్యకత తీరిపోయిందనీ, మానవజాతికే స్వాతంత్ర్యం పెరిగిందనీ అర్థం. సోషలిస్టు దశలో గడచిన అన్నిదశలలో కంటె మానవుడు ఎక్కువ స్వతంత్రుడు. ఈ స్వాతంత్ర్యం క్రమ క్రమంగా విస్తృతమౌతూ కమ్యూనిస్టు సమాజంలో పరిపూర్ణమౌతుంది. సోషలిస్టు సమాజంలో వర్గాలు లేవు కాబట్టి, స్వాతంత్ర్యం క్రమంగా పరిపూర్ణం కావడానికి అన్ని అడ్డంకులూ తొలగింపబడతాయి.

ఆర్థ సాంఘిక రాజకీయ నియమాలను గ్రహించిన మానవుడు సోషలిస్టు సమాజాన్ని సృష్టించుకోగలడు. సోషలిజం అనేది విజ్ఞానవంతుడైన మానవుడు తన విజ్ఞానం సహాయంతో, బుద్ధిపూర్వకంగా, ప్రయత్నపూర్వకంగా సృష్టించుకునే వ్యవస్థ. చరిత్రలో గడచిన వ్యవస్థలన్నీ మానవుడు బుద్ధిపూర్వకంగా సృష్టించుకున్నవి కాదు. అవన్నీ చారిత్రక నియమాలను అనుసరించి వాటంతట అవి మానవుని ప్రయత్నం లేకుండానే ఏర్పడిన వ్యవస్థలు. ''తెలియని ఏ తీవ్రశక్తులో నడిపిస్తే నడిచిన మనుష్యులు....'' అన్న మహాకవి వాక్యానికి అదే అర్థం. అందువల్లనే సోషలిస్టు సమాజ స్థాపనవరకూ గడచిన చరిత్ర అంధయుగం, లేక పూర్వ చరిత్ర (చరిత్రయొక్క పూర్వస్థితి) అనేది. అప్పటినుండే నిజమైన చరిత్ర ప్రారంభమౌతుంది. అంతవరకు మానవుడు చరిత్రకు దాసుడు. అప్పటినుండి మానవుడే చరిత్రను సృష్టిస్తాడు. నిర్ణయిస్తాడు - మానవుడే చరిత్రకు స్రష్ట, నిర్ణేత. మానవుని భవిష్యత్తును మానవుడే నిర్ణయించి, మానవుడే సృష్టించుకుంటాడు.

పెట్టుబడిదారీ సమాజంలో పాలితులకు వున్న ఆర్థిక సాంఘిక రాజకీయ స్వాతంత్ర్యం కంటె సోషలిస్టు సమాజంలోని వ్యక్తుల కందరికీ యెక్కువ స్వాతంత్ర్యం వుంటుందనేది చారిత్రక భౌతికవాద సిద్ధాంతంలో ఒక భాగం. అట్లు లేనప్పుడు కమ్యూనిస్టు సిద్ధాంతాలలోనే యెక్కడో లోపం వుందని కానీ, లేక కొందరు దుర్మార్గులు వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని హరిస్తున్నారని కానీ చెప్పవలసి వుంటుంది. మొదటివాదం నెహ్రూది. Naked God ('దిగంబర భగవానుడు') అన్న పుస్తకంలో హోవర్డ్‌ఫాస్ట్ సోదాహరణంగా నిరూపించ ప్రయత్నించినది రెండవ వాదం.

నిర్బంధ విధానం కమ్యూనిస్టు సిద్ధాంతాలలోనే వుందని, అంటే వ్యక్తుల స్వాతంత్ర్యాన్ని హరించే గుణం సిద్ధాంతాలలోనే అంతర్గతంగా వుందని నెహ్రూ ఎకనమిక్ రివ్యూ అనే పత్రికలో గత ఆగస్టు 15 సంచికలో ఒక వ్యాసం వ్రాస్తూ చేసిన ఆరోపణ. ఆలోచనలలో అస్పష్టతకు, అయోమయత్వానికి అంతర్వైరుధ్యాలకు నెహ్రూదే యెప్పుడూ అగ్రతాంబూలం కాబట్టి, యీ సద్గుణాలన్నీ ఆ వ్యాసంలోనూ వున్నాయి. కాని వాటిని యెత్తి చూపినంతమాత్రాన నెహ్రూ వాదానికి సమాధానమిచ్చినట్లు కాదు. నెహ్రూ వాదం కేవలం సిద్ధాంత ఆధారాలపై నిర్మించిన సిద్ధాంత వాదంకాదు. నెహ్రూ ఆరోపణ సిద్ధాంతానికి సంబంధించినదే ఐనా, ఆ ఆరోపణకున్న ఆధారాలు యధార్థాలు. ఆ యధార్థాలను నెహ్రూ పేర్కొనకపోయినా, అనేక దుర్ఘటనలు రష్యాలో జరిగినట్లు కృశ్చేవ్ ఒప్పుకున్నాడు గనుక, నెహ్రూ ఆరోపణ సిద్ధాంతదృష్ట్యా తప్పే ఐతే, ఆ దుర్ఘటనలు యెందుకు జరిగినాయి అనే ప్రశ్న ఇంకా మిగిలేవుంటుంది. నెహ్రూ ఆరోపణకు సమాధానంగా, మీ యిండియాలో వ్యక్తిస్వాతంత్ర్యంపైన నిర్బంధాలు లేవా అని యెదురు ప్రశ్న వేయడం సమాధాన మివ్వడం కాదు. అదీ ఒక సమాధానమే అనుకోవడం బౌద్ధికనిజాయితీ (Intellectual Honesty) కాదు. ఆ సమాధానం లాలూచీ బేరానికి ఆహ్వానించడం కావచ్చునేమో

**కమ్యూనిస్టు సిద్ధాంతాలతో సంపూర్ణంగా ఏకీభవించే హోవర్డ్ ఫాస్ట్ రష్యాలో వ్యక్తి స్వాతంత్ర్యం మీద వుండే నిర్బంధాలకు పార్టీ నాయకుల దుర్బుద్ధే కారణం అంటున్నాడు. పార్టీ నిర్మాణ విధానంలో నాయకులు విధిగా దుర్మార్గులయ్యే లక్షణాలు వున్నాయనీ, దుర్మార్గులుగా మారగలిగిన వాళ్ళు తప్ప నాయకులు కాలేరనీ ఫాస్టు ఆరోపణ. దీనికి**

**సమాధానంగా ఫాస్ట్ అభివృద్ధి నిరోధకుడనీ, సామ్రాజ్యవాదులకు అమ్ముడుపోయినవాడనీ అనడం సమాధానమే కాదు - పైగా ఫాస్ట్ ఆరోపణను రుజువు చేయడమే ఔతుంది. నోరుమూసుకొని తెలివిహీనుడేమో అని అనుమానింపబడడమే మేలు, నోరు తెరచి ఆ అనుమానాన్ని ధృవపరచడం కంటె - అన్న ఇంగ్లీషు చతురోక్తిని జ్ఞాపకం చేసుకోవడం అవసరం. స్టాలిన్ కాలంలోనూ, స్టాలిన్ మరణానంతరమూ రష్యాలో జరిగిన అత్యాచారాలూ, మరికొన్ని దేశాల పార్టీ నాయకుల అత్యాచారాలూ - ఇవే ఫాస్ట్ ఆరోపణకు ఆధారాలు. ఆ ఆరోపణ తప్పైతే, ఆ యధార్థ ఘటనలు యెందుకు జరిగినాయి అనే ప్రశ్న యింకా మిగిలేవుంటుంది.**

నెహ్రూ చెప్పేదీ, ఫాస్ట్ చెప్పేదీ కాక రష్యాలో జరిగిన ఘటనలకు మూడవ కారణం యేదైనా వుందా? Stalin Era (స్టాలిన్ యుగం) అన్న పుస్తకంలో అన్నా లూయీ స్ట్రాంగ్ ఆ ఘటనలకు స్టాలిన్ వ్యక్తిత్వము కొంత కారణమనీ, ప్రజాతంత్రపు వాసన ఎన్నడూ యెరుగని రష్యా గత చరిత్ర కొంత కారణమనీ, అన్నిటికంటే ముఖ్యంగా నాజీ పంచమాంగ దళం యొక్క సామర్థ్యంవల్ల రష్యాలో ఏర్పడిన పరిస్థితి కారణమనీ అన్నది. చివరి కారణాన్ని వివరిస్తూ రష్యా ప్రభుత్వ యంత్రాంగంలోనూ, పార్టీనాయకత్వంలోనూ నాజీలకు అమ్ముడు పోయి గూఢచారులుగా మారినవాళ్లు కొందరు బయలుదేరినారనీ దేశానికి అత్యంత ప్రమాద కరమైన ఆ పరిస్థితిలో అనుమానానికి గురిఅయిన ప్రతి వ్యక్తిమీద అనుమానం రుజువు కాకపోయినా తీవ్రమైన చర్యలు తీసుకోవలసి వచ్చిందనీ, నిర్దోషులుకూడా అనుమానానికి గురికావడం కొంతవరకైనా తప్పదనీ, రహస్య పోలీసు శాఖలోని ఉన్నతోద్యోగులే కొందరు నాజీ ఏజంట్లుగా మారి సమర్థులైన పార్టీముఖ్యులమీద అదేపనిగా తప్పుడు కేసులు బనాయించి మరణదండన విధించినారనీ, తర్వాత అది బయటపడి పోలీసు ఉద్యోగులు శిక్షింపబడినారనీ, ఆ తర్వాత జరిగిన ఘటనలలో నిందితుడా నిందించే వాడా ఎవడు దేశద్రోహి అనే ప్రశ్నకు కూడా సమాధానం తెలియని పైశాచిక భయ జ్వరం దేశంలో తాండవించిందనీ- స్ట్రాంగ్ అన్నది. ఈ వివరణ జరిగిన ఘటనలు న్యాయమే అని సమర్థించడం కాదు, జరిగిన అన్యాయాల వెనుకనున్న కారణ క్రమాన్ని వివరించడం. ఈ వివరణ అసంపూర్ణంగానే వున్నా, దీనిని లోతుగా పరిశీలిస్తే కొన్ని ప్రశ్నలు ఉత్పన్నమౌతాయి. పార్టీనాయకత్వంలోనే కొందరు ప్రజాద్రోహులుగా మారినారంటే పార్టీ నిర్మాణంలో ఏదో చాలా తీవ్రమైన లోపం వున్నట్లు కాదా? క్రమమైన ప్రజాతంత్ర పద్ధతులమీద పార్టీ నిర్మాణం జరిగితే, ప్రజాద్రోహులు నాయకులుగా పైకి రావడానికి అవకాశం వుంటుందా? నాయకులైనవాళ్ళు నాయకులైన తర్వాత ప్రజా ద్రోహానికి తలపెట్టితే, వాళ్ళ చర్యలను అరికట్టడానికి ప్రజాతంత్రం తప్ప వేరే మార్గం వుందా? రష్యా కమ్యూనిస్టు పార్టీలో సరియైన ప్రజాతంత్రం లేకపోవడానికి నాయకుల అధికార వ్యామోహం తప్ప వేరే కారణమున్నదా? ఇక్కడ పార్టీ అంతరంగిక ప్రజాతంత్రానికీ, పరిపాలనలో ప్రజల కందరికీ సంబంధించిన ప్రజాతంత్రానికీ ఉన్న భేదాన్ని గుర్తుంచుకోవాలి. పరిపాలనలో ప్రజాతంత్రం లేకపోవడానికి రష్యా చరిత్రలో ఎప్పుడూ ప్రజాతంత్రం అనేదే లేనందువలన ప్రజానీకంలో ప్రజాతంత్ర చైతన్యం (Democratic consciousness) అభివృద్ధి కాకపోవడం ప్రధాన కారణమని న్యాయంగా ఒప్పుకోవలసిందే. కాని ఆ కారణం పార్టీ నిర్మాణానికి వర్తించదు. ప్రజల చైతన్యస్థాయీ, పార్టీ సభ్యుల చైతన్య స్థాయీ ఒకటిగానే వుంటే, అది కమ్యూనిస్టు పార్టీఎట్లౌతుందో దురూహ్యం. స్ట్రాంగ్ వివరణ

ఒక విధంగా ఫాస్ట్ ఆరోపణను బలపరచడానికే తోడ్పడుతుందనవచ్చు. కాదంటే నెహ్రూ ఆరోపణ బలపడుతుంది.

రష్యాలో జరిగిన దుర్ఘటనల కన్నిటికీ స్టాలిన్ స్వాతిశయమూ, దురహంకారమే కారణమని కృశ్చేవ్ అంటున్నాడు. ఈ గుణాలకు వ్యక్తిపూజ అని పేరుపెట్టి, వ్యక్తిపూజకు (cult of the Individual) విరుగుడు ప్రజాతంత్రమే అనికూడ కృశ్చేవ్ అన్నాడు. క్రమమైన, ఆరోగ్యవంతమైన ప్రజాతంత్ర పద్ధతులు అమలులోవుంటే ఒక వ్యక్తి నియంతకాలేడు. పార్టీలోని ప్రజాతంత్రాన్ని స్టాలిన్ అణగద్రొక్కినాడని కృశ్చేవ్ అంటున్నాడేకాని, ఆ ప్రజాతంత్రం ఒక వ్యక్తి కాలిక్రింద అణగేటంత బలహీనంగా వుండిందనే సంగతి కృశ్చేవ్ గుర్తించినట్లు కనపడదు.

ప్రజలలోకాని, పార్టీసభ్యులలోకాని ప్రజాతంత్ర చైతన్యం పెరగాలంటే ప్రభుత్వ నిర్వహణ లోకాని, పార్టీ వ్యవహారాల నిర్వహణలోకాని ప్రజాతంత్ర పద్ధతులు అమలులో వుండక తప్పదు. ప్రజాతంత్ర పద్ధతులు అభివృద్ధి కావాలంటే ప్రజాతంత్ర చైతన్య స్థాయి పెరగడం అవసరం. ప్రజాతంత్ర ఆచరణా (Democratic Practice), ప్రజాతంత్ర చైతన్యమూ పరస్పర పోషకాలు, పరస్పర వర్ధకాలు. ప్రజాతంత్ర చైతన్యాన్ని పెంచడానికవసరమైన ప్రజాతంత్ర పద్ధతులు ఈనాటి పార్టీ నిర్మాణ విధానంలోనే లేవనీ, నిర్మాణ విధానం నియంతృత్వానికి విధిగా దారితీస్తున్నదనీ, ఈ నిర్మాణ విధానంలో మార్పు రాకుండా నాయకులైనవాళ్లు జాగ్రత్త పడుతున్నారనీ ఫాస్టు ఆరోపణ.

ఇక ''వ్యక్తి స్వాతంత్ర్యం - సమాజ శ్రేయస్సు'' అనే సమస్యను పరిశీలించవచ్చు.

భారతదేశంలో ప్రతి వ్యక్తికీ కావలసిన ముఖ్యమైన స్వాతంత్ర్యం ఆర్థిక స్వాతంత్ర్యం. సోషలిస్టు ఆర్థిక విధానం మాత్రమే ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ప్రసాదించగలదు. కాబట్టి ఈ పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని మార్చేవరకూ ఈ సమస్యను మనం ఇంతకుమించి చర్చించవలసిన అవసరం లేదు.

**సోషలిస్టు సమాజంలో వ్యక్తి స్వాతంత్ర్యం:** సోషలిస్టు సమాజంలోని వ్యక్తి స్వాతంత్ర్య సమస్యే యిపుడు ప్రపంచ ప్రజలనందరినీ కలవరపరుస్తున్నది.

సోషలిస్టు సమాజంలో సమాజ శ్రేయస్సుకు భంగం కలగకుండా వ్యక్తికి ఎంత స్వాతంత్ర్యం యివ్వవచ్చు - యెంతవరకు నిర్బంధించవచ్చు?

మార్క్సిస్టు సూత్రాల దృష్ట్యా పెట్టుబడిదారీ సమాజంలోకంటె సోషలిస్టు సమాజంలో మానవుడు ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా ఎక్కువ స్వతంత్రుడు అని తేలింది. అంటే ఆర్థికంగా కాని, సాంఘికంగా కాని, రాజకీయంగా కాని ఏ వ్యక్తిమీదా పెట్టుబడిదారీ సమాజంలో వున్న నిర్బంధాలు సోషలిస్టు సమాజంలో వుండవలసిన అవసరంలేదని, అంతకంటె యెక్కువ స్వాతంత్ర్యం వుండినా ప్రమాదం లేదని.

**ఆర్థిక స్వాతంత్ర్యం:** పెట్టుబడిదారీ సమాజంలో జాతీయ ఐశ్వర్యం (వస్తుసంపద) పెరగడానికి ఆ సమాజ ఆర్థిక విధానమే అడ్డుపడుతుంది. ఆ అడ్డులన్నీ తొలగించబడిన సోషలిస్టు సమాజంలో ఐశ్వర్య అభివృద్ధికి పరిమితులే లేవు. కాబట్టి తలసరి ఆదాయమూ, జీవన స్థాయీ క్రమంగా పెరుగుతూనే వుంటాయి.

పెట్టుబడిదారీ సమాజంలో (ఒక పరిమితి వరకు) జాతీయ ఐశ్వర్యం పెరిగినా, వర్గదోపిడీ మూలంగా పాలకవర్గం యొక్క తలసరి ఆదాయం పెరుగుతుంది కాని, పీడితవర్గం యొక్క తలసరి ఆదాయం పెరగదు; ఏ కొంచెమో పెరిగినా, పాలకుల ఆదాయం పెరిగినంతగా పెరగదు; కాబట్టి పెట్టుబడిదారీ సమాజంలోని కార్మికుల జీవన స్థాయికంటె (అదే సమాజం సోషలిస్టు సమాజంగా మారినప్పుడు,) ఆ సోషలిస్టు సమాజంలో ప్రజలందరి జీవనస్థాయి యెక్కువగా వుంటుంది.

ఎవరూ ఏ పనీ చేయకపోతే వస్తుసంపదలేదు. కాబట్టి ప్రతి వ్యక్తి విధిగా శ్రమచేయక తప్పదు. ఇది ఒక ఆర్థిక నిర్బంధంగా సోషలిస్టు సమాజంలో వుండక తప్పదు (కమ్యూనిస్టు సమాజ చర్చ అప్రస్తుతం).

ప్రతి వ్యక్తికీ ఏదో ఒక ఉద్యోగంచేసే హక్కు వుంటుంది. విద్యార్థి దశలో ఏదో ఒక వృత్తిలో శిక్షణ పొందే హక్కు వుంటుంది. (ఈ హక్కులు పెట్టుబడిదారీ సమాజంలో లేవు). ఆర్థిక స్వాతంత్ర్యమంటే ప్రధానంగా ఈ రెండు హక్కులే.

ప్రతి వ్యక్తికీ తనకు యిష్టంవున్న పనిమాత్రమే చేసే హక్కు వుంటుంది. ఇష్టంలేని పని చేసి తీరాలనే నిర్బంధం వుండదు. ఒక ఉద్యోగం చేసే వ్యక్తి, ఆ ఉద్యోగం నుండి మరొక ఉద్యోగానికి మారే హక్కు, అందుకు అవసరమైన శిక్షణ పొందే హక్కు వుంటాయి. వ్యక్తిచేసే పనివల్ల సమాజం సంపూర్ణ ఫలితం పొందాలంటే వ్యక్తికి ఈ హక్కు అవసరం - అంటే సమాజ శ్రేయస్సుకే అవసరం.

యుద్ధ భయం వున్న సోషలిస్టు సమాజం నిర్బంధ సైనిక వృత్తి విధించవచ్చు. ప్రజలలో సోషలిస్టు చైతన్యం తగినంతగా వుంటే నిర్బంధం కూడా అనవసరం.

పనిని బట్టి జీతం (To each according to his work) అనే సూత్రం వ్యక్తుల ఆదాయాలను నిర్ణయిస్తుంది కాబట్టి, ప్రతి వ్యక్తికీ తన శారీరక భౌతికయోగ్యతలకు తగిన వుద్యోగం పొందే హక్కు వుంటుంది. ఈ యోగ్యతలను అధ్యయనం (Study) ద్వారా, శిక్షణ (Training) ద్వారా, ప్రయోగం ద్వారా జీవితాంతం అభివృద్ధి చేసుకొనే హక్కు వుంటుంది. ఇది కూడా సమాజ శ్రేయస్సుకే అవసరం.

వ్యక్తికీ, సోషలిస్టు సమాజానికీ వైరుధ్యం లేదు. అందువల్లనే వ్యక్తికి ఎన్ని హక్కులు యిచ్చినా సమాజానికి కూడా శ్రేయస్కరంగానే వుండడం. ప్రతి వ్యక్తీ ఏదో ఒక పనిచేసి తీరాలనే నిర్బంధం మానవునికీ ప్రకృతికీవున్న వైరుధ్యంవల్ల.

**సాంఘిక స్వాతంత్ర్యం:** అంటే ప్రతి వ్యక్తీ సంఘంలో మరొక వ్యక్తి కంటె తక్కువగా, అగౌరవంగా చూడబడకుండా వుండడం. సాంఘికంగా అందరూ సమానులే. గత చరిత్రలో జన్మమూ, చర్మమూ, కులమూ, ధనమూ, రాజకీయ అధికారమూ మొదలైనవి వ్యక్తుల సాంఘిక యోగ్యతలను - సాంఘిక గౌరవా గౌరవాలను - నిర్ణయిస్తూ వచ్చినాయి. సోషలిస్టు సమాజంలో ఈ విచక్షణ వుండదు. స్త్రీ కంటె పురుషుడు అధికుడు కాదు; కార్మికునికంటె ఆఫీసు ఉద్యోగి గౌరవనీయుడు కాదు. కొడుకు కంటె తండ్రి మాననీయుడు కాదు. క్రింది ఉద్యోగికంటె పై ఉద్యోగి గొప్పవాడు కాదు; తక్కువ జీతం వచ్చేవానికంటె ఎక్కువ జీతం వచ్చేవాడు ఎక్కువ గౌరవం పొందడు; వ్యకులందరూ సాంఘికంగా సమానులే. ఒక వ్యక్తి

గొప్ప ప్రభుత్వోద్యోగి ఐనా, పార్టీ నాయకుడైనా, మహాకవి ఐనా, ఆయా రంగాలలో వాని సామర్థ్యమూ, ప్రజ్ఞా గుర్తింపబడవచ్చు. కానీ అందువలన వానికి సంఘంలో కలిగే గౌరవం యేమీ వుండదు. 'కార్మికుల పిల్లలూ, మేధోపజీవుల (Intellingentsia) పిల్లలూ పరస్పరం వివాహం చేసుకోవడం మామూలు విషయమైనప్పుడు సాంఘిక సమానత్వం వుందని చెప్పవచ్చు' అంటూ బెర్నార్డుషా 'ఆర్థిక సమానత్వం వున్నప్పుడు తప్ప సాంఘిక సమానత్వం కలుగదు' అన్నాడు. కానీ ఆర్థిక సమానత్వం వున్నంత మాత్రాన సాంఘిక సమానత్వం కలుగక పోవచ్చు. ఇంగ్లండులో కూడా సమానమైన ఆదాయాలు వున్న కార్మికుడూ, ఆఫీసు ఉద్యోగీ, సాంఘికంగా సమానగౌరవం పొందలేదు. కార్మికుల సంస్కారంకంటె మధ్యతరగతి ప్రజల సంస్కారం గొప్పదని గుర్తింబడుతూ వుంది. కాబట్టి సాంఘిక సమానత్వం ఏర్పడడానికి సాంస్కృతిక ఏకత్వం కూడా అవసరమే. అంటే ప్రవర్తనలోనూ అభిరుచులలోనూ, వ్యక్తులలో భేదాలు వుండవని కాదు. వైయక్తిక భేదాలు ఎన్ని వున్నా, కార్మిక సంస్కారమూ, విద్యావంతుల సంస్కారమూ, పట్టణ సంస్కారమూ, గ్రామీణ సంస్కారమూ అనే విభజనకు అవకాశం లేకుండా వుండడం, మేధాశ్రమనూ, శరీరశ్రమనూ వేరుచేసే శ్రమవిధులు అంతమై పట్టణాలు, పల్లెలు అనే భేదం నశించినపుడు, సంపూర్ణ సాంస్కృతిక ఏకత్వం విధిగా ఏర్పడుతుంది. కానీ, అంతవరకూ సాంఘిక అసమానత్వం వుండనక్కరలేదు. ఆర్థిక అసమానత్వాన్ని వీలున్నంతవరకూ తగ్గించడం ద్వారానూ, విద్యావిధానంతోనూ, ప్రచార ప్రబోధాలతోనూ సాంఘికసమానత్వం సాధించవచ్చు. కాని అన్నిటికంటే ముఖ్యమైనది ప్రజాతంత్ర ఆచరణ. ప్రజా జీవితంలో అన్ని రంగాలలోనూ, అన్ని స్థాయిలలోనూ ప్రజాతంత్రం వుంటే తప్ప, వ్యక్తులలో ఆత్మగౌరవమూ, ఆత్మ విశ్వాసమూ పెరగవు. ఈ గుణాలు పెరగకుండా సాంఘిక సమానత్వం ఏర్పడదు. సామాన్య ప్రజలలో అవిద్య, న్యూనతాభావం (Inferiority complex) నశించినప్పుడు ప్రజాతంత్రం వలన ఏ దుష్ఫలితమూ కలుగదు. కాబట్టి సాంఘిక సమానత్వం అనేది సమాజ శ్రేయస్సుకే అవసరం. సాంఘిక సమానత్వం అనేది ఒకరు యిస్తే ఒకరికి వచ్చేది కాదు. అది ఒక సంస్కారం. ప్రజల జీవితంలో ఒక భాగం. ప్రజల మానసిక ఆరోగ్యంలో ఒక భాగం. ప్రజాతంత్రం ఒక రాజకీయ వ్యవస్థ కాదు. అది ఒక జీవిత విధానం (Democracy is a way of life) అన్న సూక్తికి అదే అర్థ

**రాజకీయ స్వాతంత్ర్యం:** వర్గ దోపిడీలేని సోషలిస్టు సమాజంలో ప్రభుత్వం అనేది సమష్టి ప్రయోజనాలకొరకు, సమష్టి వ్యవహారాలను నిర్వహించే యంత్రాంగం మాత్రమే. కాబట్టి ప్రభుత్వ నిర్వహణలో వ్యక్తులందరికీ సమానమైన అధికారాలుంటాయి. విప్లవం ద్వారా సోషలిస్టు ప్రభుత్వాలు ఏర్పడిన దేశాలలో కార్మికవర్గ నియంతృత్వం అవసరమైనప్పుడు అది వ్యక్తి నియంతృత్వంగా పరిగణించకుండా వుండడానికి పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రం తప్ప మార్గం లేదు. పార్టీకి సమష్టి నాయకత్వం (collective leadership) వుంటుందే కాని, వ్యక్తి నాయకత్వం యెప్పుడూ వుండదు. నాయకత్వం అంటే ప్రజాతంత్ర పద్ధతుల ద్వారా యెన్నుకొనబడిన నాయకత్వం.

కార్మికవర్గ నియంతృత్వం యొక్క అవసరం తీరిన తర్వాత ప్రభుత్వ వ్యవహారాలన్నిటిలోనూ సంపూర్ణ ప్రజాతంత్రం ఆచరణలో పెట్టాలి. అట్టి సోషలిస్టు ప్రజాతంత్రంలో వ్యక్తికి ఏయే హక్కులు వుండేది 1936లో ప్రకటింపబడిన రష్యా రాజ్యాంగంలో స్పష్టంగానే

పేర్కొనబడినాయి. మార్క్సిస్టు సిద్ధాంతాల ప్రకారం పెట్టుబడిదారీ సమాజంలోకంటె సోషలిస్టు సమాజంలో వ్యక్తికి యెక్కువ రాజకీయ హక్కులు వుంటాయి. అదే విధంగా యే బూర్జువా ప్రజాతంత్ర రాజ్యాంగంలోనూ లేనన్ని హక్కులు రష్యా రాజ్యాంగంలో గ్యారంటీచేయబడినాయి. కానీ, దురదృష్టవశాత్తు ఆ హక్కులన్నీ ఔను, అన్నీ - 1936లోనే భగ్నం చేయబడినాయి; భగ్నం చేయబడినాయని కృశ్చేవే అన్నాడు.

ప్రజాతంత్ర చైతన్యమూ, ప్రజాతంత్ర ఆచరణా పరస్పర పోషకాలు. కాబట్టి, పార్టీ నాయకత్వం ఒక విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రజాతంత్రం అపరిపక్వంగా వున్న రోజుల్లో కొన్ని దుష్ఫలితాలు కలుగవచ్చు; కానీ, అవి తాత్కాలికమే. ప్రజాతంత్రం పరిపక్వమయ్యేకొద్దీ దుష్ఫలితాలు తగ్గుతాయి. కానీ ప్రజాతంత్ర రాహిత్యంవల్ల, నియంతృత్వంవల్ల - కలిగే దుష్ఫలితాలకు ఒక పరిమితి అనేదే లేదు. అణుబాంబుల యుగంలో మానవజాతినే నాశనం చేయవచ్చు; అంతకంటే భయంకరంగా మానవజాతిలోని మానవత్వాన్ని నాశనం చేయవచ్చు.

**ముగింపు:** నియంత దుర్మార్గుడైతే దుష్ఫలితాలు కలుగుతాయి: సన్మార్గుడైతే ప్రజాతంత్రం కంటె సత్ఫలితాలు కలుగుతాయి - అని వాదించే వాళ్ళ రాజకీయ పరిజ్ఞానం శైశవదశలో వుందనవచ్చు. మంచి నియంత అనేవాడు ఆర్థికరంగంలోనో, యుద్ధరంగంలోనో ఘనమైన విజయాలు సాధింపవచ్చు. కానీ, ప్రజలలో ప్రజాతంత్ర చైతన్యాన్ని తప్పక నాశనం చేస్తాడు. అప్పుడు ఏ రాజకీయ అవకాశవాది ఐనా, ఎంత అవకాశవాది ఐతే అంత సులభంగా నియంత కావచ్చు. అంటే, ఎంత మంచి నియంత ఐనా తన తరువాత దుర్మార్గులే నియంతలయ్యే దుస్థితిని విధిగా సృష్టించి పోతాడు.

అసలు మంచి నియంతవలన సత్ఫలితాలు కలుగుతాయని ఊహించడంలోని ప్రాథమిక దోషం ప్రజలు కోరేది తిండి, బట్ట మొదలైన భౌతిక సంపద మాత్రమే అని అనుకోవడంలో వుంది. భౌతిక సుఖాలకొరకు మానవుడింతటి మహోన్నతమైన సంస్కృతిని సృష్టించుకో లేదు. నియంతృత్వంలో క్రమశిక్షణ, ఆజ్ఞాపాలన, విధేయత అనేవి సద్గుణాలుగా పరిగణింప బడి, స్వాభిమానం, ఆత్మగౌరవము అనేవి నశించి క్రమంగా బానిస భావం ప్రబలి, మానవత్వంలోని ముఖ్య గుణాలైన ప్రేమ, అనురాగం, స్నేహం, సౌభ్రాతృత్వం, జిజ్ఞాస, సౌందర్య పిపాస అన్నీ అడుగంటుతాయి. 'ఆశయాలకోసం అసువులు బలి చేస్తున్నామిప్పుడు - అసువులకోసం ఆశయాలు బలిచేస్తామప్పుడు' అన్న తెలుగు కవి వాక్యం నియంతృత్వాన్ని ఉద్దేశించి అన్నదే. ఆశయాలకోసం అసువులు బలి యిచ్చినప్పుడే మానవుడింతటి ఉచ్చస్థితికి వచ్చినాడు. మానవజాతిలో అసువులు కొరకు ఆశయాలు బలియిచ్చే మనస్తత్వమే పెరిగితే అప్పుడిక పదివేల కారల్ మార్క్సులైనా మానవుని ఉద్ధరించలేరు.

సంఘంలో ఎవరికీ యెంత స్వల్పమైన అన్యాయం కూడా జరగకుండా వుండాలంటే, యెంతస్వల్పమైన అన్యాయాన్నయినా సహించలేని సంస్కారమూ, సమష్టిగా యెదిరించే అలవాటూ ప్రజలందరిలో వుండాలి. అదే మానవత్వం దాని కొరకే ప్రజాతంత్రం. ప్రజాతంత్రమే వ్యక్తి స్వాతంత్ర్యం. ★

**యీ సిద్ధాంత వ్యాసం 1959లో మొదటిసారిగా ప్రచురించబడినది**

(రా.రా. స్మారక సమితి సౌజన్యంతో)

# బ్రెయిన్ డ్రెయిన్

మాకినీడి సూర్య భాస్కర్

మన దేశం శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణుల పరంగా ప్రపంచంలో అమెరికా, రష్యాల తర్వాత మూడవ స్థానంలో ఉందని చెబుతాం. అంతవరకు సంతోషమే. కాని, వారియొక్క సేవలను మనం ఉపయోగించకో(లే)ని పక్షంలో శాస్త్రసాంకేతిక నిపుణుల్ని ఉత్పత్తి చేసే దేశాలలో మనది మూడోదని చెప్పుకోవడం అర్థం లేనిది. శాస్త్ర సాంకేతిక నిపుణుల సేవలను మనం వినియోగించకోలేక పోవడానికి ముఖ్యమైన కారణం 'మేధావుల వలస'(Brain-Drain). ఈ వలసకు కారణం స్థూలంగా-శాస్త్రజ్ఞులు వారి గవేషణకు ప్రభుత్వం కల్పించే చాలీ చాలని సౌకర్యాలతో విసుగు చెందిపోవడం, ఫలితంగా వారికి వృత్తిపట్ల సంతృప్తి లేకపోవడం, అదే ప్రభుత్వం వారి గవేషణ మార్గంలో రాజకీయంగా జోక్యం కలిగించుకోవడం వంటివి. వీటిని చర్చించాలంటే ముందుగా 'మేధావుల వలస'ను నిర్వచించి, ఈ వలసలోని రకాలను అధ్యయనం చేయడం అవసరం.

మేధావుల వలసను నిర్దుష్టంగా నిర్వచించలేక పోయినప్పటికీ, సాంకేతికంగా బహుముఖ ప్రజ్ఞా పాటవాలు కలిగి, బాగా చదువుకున్న శాస్త్ర సాంకేతిక నిపుణులకు, మేధావులకు ఉజ్జ్వల భవిష్యత్తు, వారివారి రంగాలలో ఎదిగే అవకాశాలు లేకపోవడం వంటి కారణాల వల్ల స్వదేశాన్ని విడచి పోవడంగా చెప్పుకోవచ్చు. భారత గణాంక సంస్థ (Indian Statistical Institute) ఛైర్మన్ పి. ఎన్. హక్సర్, మేధావుల వలసను "flight of intellectual capital seeking profitable investment" అంటారు.

మేధావుల వలస రెండు విధాలు-బహిర్వలస (External Brain-drain), అంతర్వలస (Internal Brain-drain). నిర్వచనంలో చెప్పుకొన్నట్లు, కారణాలేవైనా, మేధావులు దేశం విడచి మరొక దేశం వలస పోతే దానిని బహిర్వలస అనవచ్చు. మేధావుల వలసను స్థూలంగా బహిర్వలసగానే చెబుతుంటారు. కాని, అంతర్వలస బహిర్వలస కంటె ఏ విధంగాను తక్కువదేమీ కాదు. చదివిన చదువుకు తగిన ఉద్యోగం లేకపోతే అది బహిర్వలసనే గాక అంతర్వలసను కూడ పెంపొందిస్తుంది. ఉదాహరణకు, బాగా, పెద్దగా చదువుకున్న ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు పౌరసేవలు-పరిపాలనా రంగంలో (civil and administrative sevices) చేరడం. దీనికి కారణం మన సంఘం, ఆ సంఘ వ్యవస్థలో పనిచేయడానికి UPSC ద్వారా వచ్చే అధికార్లను అనుమతించి ప్రోత్సహించడం. శాస్త్రరంగంలో మనకు నోబుల్ బహుమతిని సాధించిన సర్. సి.వి. రామన్ జీవితపు తొలిభాగం ఈ అంతర్వలసకు గురైంది. ఏ విధంగా అంటే, ''రామన్ భారతీయ ఆడిట్ అండ్ అకౌంట్ల శాఖలో తన కాలాన్ని...జీవితాన్ని పాడు చేసారు...చివరికి ఆయన అందులో ఉండలేక దాన్ని వదలి శాస్త్ర గవేషణకు అంకిత మయ్యారు.'' (అశుతోష్ ముఖర్జీ). మరొక రకమైన అంతర్వలస ఏమంటే, మంచిమంచి శాస్త్రజ్ఞులు విశ్వవిద్యాలయాల అభివృద్ధికి తోడ్పడవలసినవారు కంపెనీలకు ఆకర్షింపబడడం.

ఒక దేశం నుంచి మరొక దేశానికి కాకున్నా, విద్యాధ్యయన పరిధి నుంచి (academic) వాణిజ్య పరిధికి మారడం కూడ మేధావుల వలసగానే మనం చెప్పుకోవచ్చు.

మేధావుల వలసకు అనేక కారణాలున్నాయి. అందులో ముఖ్యమైన వాటిని చర్చిద్దాం.

**ప్రతిభ గుర్తింపబడకపోవడం(non-recognition of merit)**: రాజకీయార్థిక, స్వపర భేదాలవల్ల ప్రతిభ లేనివారికి పట్టం కట్టడం జరుగుతోంది. దీనివల్ల ఏర్పడే నైరాశ్యంతో(frustration) ప్రతిభ స్వదేశంనుంచి వలస పోతుంది.

ఈ విషయపరంగా లోపం ఎక్కడుందంటే, మన మేధావుల ప్రతిభను మనంతట మనం గుర్తించలేక పోవడం. వారి ప్రతిభను ఇతర దేశాలు గుర్తించాకనే మనం గుర్తించడం జరుగుతోంది. విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ నోబుల్ పురస్కారాన్ని అందుకున్న తర్వాత బెంగాల్ లోని ప్రముఖులు ఆయన్ని గుర్తించి సత్కారం చేస్తామంటే, దానికి విసుగు చెందిన ఠాగూర్ ''విదేశీయులు గుర్తించేవరకు నాది కవిత్వం కాకుండా పోయిం''దంటూ వాపోయారంటే, మన మేధావుల పట్ల మన ప్రవృత్తి అవగాహనను అంచనా వేసుకోవచ్చు.

దీనికి కారణమాలోచిస్తే- భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలు గతంలో దాస్యాన్ని అనుభవించటం వల్ల పరదేశీపాలకుల అభిప్రాయాలే వీరి అభిప్రాయాలుగా మారి, కేవల ఆజ్ఞాపాలనే కాని, స్వతంత్రగా ఆలోచించే శక్తిని కోల్పోయాయి. తద్వారా స్వాతంత్ర్యానంతరం కూడ ఆయా దేశాలు ఇదివరకటివలె ఇతరుల అభిప్రాయాలపై ఆధారపడి మాత్రమే ఆలోచించడం సాగించేస్తున్నాయి. ఆ విధంగా ఈ అభివృద్ధి చెందుతున్న దేశాలు, అభివృద్ధి చెందిన దేశాల దృష్టితో చూడటం వల్ల ప్రతిభకు స్వదేశంలో తగిన గుర్తింపు లేకపోతోంది. తత్ఫలితంగా, ఆయా దేశాలలోని మేధావి వర్గం ఒక సారైనా అభివృద్ధి చెందిన దేశాలకు వెళ్ళి, తద్వారా లభ్యమయే సామాజికార్థిక గుర్తింపుకు వెంపర్లాడటం జరుగుతోంది.

**తృప్తికరమైన ఉద్యోగావకాశాల మృగ్యత (Lack of Satisfactory Job Opportunities)** : సాధారణంగా విద్యాధికులందరు ఉద్యోగం ఆశించేవారు కావడం వల్ల ప్రభుత్వోద్యోగానికి అధికతరమైన పోటీ ఏర్పడడం, తదనుగుణంగా జరిగే వివిధ ప్రయత్నాలలో అనేకానేకమైన ఒత్తిడులు, స్వార్థపరత్వం చోటు చేసుకొని, ప్రతిభావంతులకు తగిన తృప్తికరమైన ఉద్యోగావకాశాలు లేకుండా పోతున్నాయి. అందువల్ల వారి ప్రతిభకు తగ్గ-ఉద్యోగాల నన్వేషిస్తూ మేధావులు అభివృద్ధి చెందిన దేశాలకు వలస పోతూన్నారు. ఉదాహరణగా, డా. హరగోవింద ఖొరానానే తీసుకోవచ్చు. జీవకణాలలోనుండే జన్యుపదార్థాన్ని (DNA) కృత్రిమంగా సంశ్లేషించిన మహాద్భుత చర్యతో ఆయన నోబుల్ బహుమతిని సాధించారు. ఆ పురస్కారం వచ్చేవరకు ఆయన ప్రతిభకు స్వంత దేశంలో గుర్తింపు లేకపోయింది.

**ప్రోత్సాహావకాశాల లోటు(Lack of encouragement and opportunity)**: మేధా వికాసం, ప్రతిభాప్రాభవం అనేవి వ్యక్తికి లభించే ప్రోత్సాహావకాశాలకు అనులోమానుపాతంలో ఉంటాయి. ఎప్పుడైతే ప్రోత్సాహావకాశాలు లోపించుతాయో అప్పుడే మేధావులు యితర దేశాలకు వలసపోవడం జరుగుతోంది. భారతదేశం వంటి తృతీయ ప్రపంచ దేశాలు అధునాతన సాంకేతిక విషయాలలో పరిశోధనలు చేసి ఉన్నత శాస్త్రసాంకేతిక పరిజ్ఞానాన్ని దేశానికి సమకూర్చాలను

కునే వారికి తగిన వసతులు, సౌకర్యాలు, సదుపాయాలు సమకూర్చడంలేదు. ఇట్టి స్థితిలో, సంపన్న దేశాలలో శాస్త్రసాంకేతిక పరిశోధనలకు లభించే ప్రోత్సాహం అపారం కావడంతో మేధావులు ఆయా దేశాలకు వలస పోవాలని భావించడం జరుగుతోంది.

ఈ కారణాలే కాకుండ, మన మేధావులు వలస పోవడానికి విద్యా వ్యవస్థలోని లోపాలు, రాజకీయనాయకుల జోక్యం (frequent interferences of politicians), చాలీచాలని జీతాలు, తృప్తికరమైన సాంఘిక హోదా లేకపోవడం, వారి పనిని శాంతియుతంగా కొనసాగించడానికి అవసరమయ్యే కనీస అవసరాలను (Transport and Telephone facilities etc) కలిగించకపోవడం వంటి అనేకానేక కారణాలున్నాయి.

నేటి విద్యార్థులే రేపటి మేధావులు. అందువల్ల, మన విద్యా వ్యవస్థలోనే కొన్ని మౌలికమైన మార్పులు తేవాలి. పాఠ్యాంశాల బోధనలోను, కరిక్యులంలోను దేశాభిమానాన్ని, దేశభక్తిని రగుల్కొలిపే పాఠాలను, అంశాలను, ముఖ్యంగా ప్రాథమిక, మాధ్యమిక విద్యాస్థాయిలలో ప్రవేశపెట్టాలి. ఈ నేలపై పుట్టి, యిక్కడి గాలిపీల్చి, యిక్కడి వనరుల సాయంతో మేధావియై, ఆ మేధస్సును ఈ దేశ ప్రగతికి, ప్రతిష్ఠకు కాకుండా యితర దేశానికి తాకట్టు పెట్టడం ఎంత లజ్జాకరమైన విషయమో తెలియ జెప్పాలి. ఆ విధంగా నైతికంగా, మానసికంగా విద్యార్థులను తీర్చిదిద్దడం వల్లనే ఈ సమస్యను చాలవరకు పరిష్కరించగలం.

పరిశోధనలలోను, ప్రాజెక్టుల నిర్వహణలోను తరచు రాజకీయ నాయకుల జోక్యం వల్ల సాంకేతిక నిపుణులకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేక వృత్తి రీత్యా కలిగే నిరాశా, నిస్పృహలవల్ల, తరచు రాజకీయ నాయకులకు, నిపుణులకు మధ్య భేదాభిప్రాయాలు తలెత్తడంవల్ల మేధావులు వృత్తిపరంగా తమకు పూర్తిస్వేచ్ఛ లభించే దేశాలకు వలసపోతూ ఉన్నారు.

**మేధావుల వలస వలన నష్టాలు:**

ఈ మేధావుల వలస వలన అభివృద్ధి చెందుతున్న దేశాలు ఎన్నో యిబ్బందులను ఎదుర్కొంటూంటే, అభివృద్ధి చెందిన దేశాలు మాత్రం శాస్త్రసాంకేతిక రంగాలలో యింకా అభివృద్ధి చెందుతున్నాయి. దీనివల్ల సాంకేతికాభివృద్ధి పరంగా ఈ రెండు ప్రపంచాల మధ్య అంతరం మరీ పెరిగిపోతోంది.

మేధావుల వలస వల్ల తృతీయ ప్రపంచ దేశాలనుంచి సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందిన దేశాలకు ప్రవహించడవల్ల, ఈ సాంకేతిక జ్ఞానం కోసం (Technical knowhow) అభివృద్ధి చెందే దేశాలు, చెందిన దేశాలపై ఆధారపడవలసి వస్తోంది. ఈ వలసే లేకపోతే అభివృద్ధి చెందిన దేశాలు శాస్త్రసాంకేతిక రంగంలో గుత్తాధిపత్యాన్ని (monopoly) సాధించనేలేవు.

కొందరంటారు-అభివృద్ధి చెందిన ప్రపంచం, చెందుతున్న ప్రపంచానికి ఋణ సహాయాన్ని ఇవ్వడం ద్వారా వలసకు నష్టపరిహారం చెల్లిస్తోందని. ఇది ఎంతవరకు సబబు? అసలు నిజమా? కాదా?

అమెరికా భారతదేశానికి 1970లో రూ.360కోట్లు ఋణాన్నిచ్చింది. మేధావుల వలస వల్ల అదే సంవత్సరంలో అమెరికాకు ఆదాయం 840 మిలియన్లు(ప్రకాష్.సి.జైన్). UNCTAD నివేదిక

ప్రకారం, వివిధ వృత్తులు చేపట్టిన భారతీయుల విదేశీవలస వలన వివిధ పరిశ్రమలకు వాటిల్లిన నష్టం యిలా ఉంది.

వివిధ పరిశ్రమలనుంచి వలసవల్ల భారతదేశానికి కలిగే నష్టం ('000 డాలర్లలో)

| వర్గం | పరిశ్రమలు భారీ తరహా | మధ్య తరహా | చిన్న తరహా | మొత్తం డాలర్లు |
|---|---|---|---|---|
| శాస్త్ర, వాణిజ్య కళారంగాల పట్టభద్రులు | 30 | 17 | 18 | 65 |
| ఇంజనీర్లు మరియు డాక్టర్లు | 61 | 76 | 13 | 150 |

**Source:** UNCTAD Reverse Transfer of Technology as quoted in Main Stream, Nov. 1974.

ప్రస్తుతార్థిక స్థితులలో మేధావుల వలసన్నది సాంఘికార్థిక వాస్తవాలలో (socio-economic realities) వ్రేళ్లూని ఉంది. పట్టణాలనుంచి చదువుకున్న వారు, మేధావులు విదేశాలకు వలస వెళ్లడం వల్ల గ్రామీణులు పట్టణాలకు తరలిరావడం. తద్వారా గ్రామీణాభివృద్ధి కుంటుపడడం జరుగుతోంది. ఈ వలసవల్ల కలిగే ధనార్జన పరమైన అసమానతల వల్ల తీవ్రమైన అసంతృప్తి ఏర్పడుతోంది. ఇతర అభివృద్ధి చెందిన దేశాలకు పోలేని మేధావులు తమను తాము న్యూనతగా భావించుకొని, ఆత్మవిశ్వాసం కోల్పోయి దేశపురోభివృద్ధికి అవరోధంగా తయారవుతున్నారు. అంతేకాకుండా, నిజానికి ప్రస్తుతం మనకున్న అగ్రశ్రేణి శాస్త్రజ్ఞులకు, వారు పదవీ విరమణ చేసేనాటికి అనుయాయులు (successors) లేకుండా పోతున్నారు. తద్వారా మన మేధావులలో (intellectual outputs) మీడియాక్రటీ (mediocrity) బాగా పెరిగిపోవాడానికి ఆస్కారముంది.

వలస పోయే మేధావులు సాధారణంగా అధికాదాయ వర్గానికి చెందినవారై ఉంటారు. కాబట్టి, వారివల్ల టాక్సుల రూపంలో రాగల పెద్దపెద్ద మొత్తాలను దేశం కోల్పోతోంది. ఆ విధంగా అభివృద్ధి చెందుతున్న దేశాలు కొంతమేరకు ఆర్థికంగా వెనుకబడి అత్యవసరమైన మేధాసంపత్తిని కోల్పోవడంవల్ల అభివృద్ధి కుంటుపడి, స్వదేశ సాంకేతిక పరిజ్ఞానం కూడ మేధావుల కొరత వల్ల నిరుపయోగమౌతుంది. ఈ విధంగా అధిక ప్రతిభా వ్యుత్పత్తులు గలవారు వలసపోతూ, సాంఘికార్థిక మార్పులను దోహదపరచే ఉత్ప్రేరకంగా వ్యవహరిస్తున్నారు. ఇటువంటి వలస యొక్క ఫలితాలను తులనాత్మకంగా (Quantiative) గా మనం గమనించగల్గినా గుణాత్మకం (Qualitative) గమనించలేం. అంతేకాక గుణాత్మక ఫలితాలెంతో ప్రమాదకరమైనవి కూడ.

ఇతర సంపన్న దేశాలకు వలసలను ప్రోత్సహిస్తే ఆ మేధావులు పంపే ధనాల వల్ల విదేశీమారక ద్రవ్యం (foreign exchange) లభిస్తుందంటారు కొందరు. అయితే, యిక్కడ గమనించవలసినది ఒకటుంది. ఒక మేధావిని తయారు చేయాలంటే మన ప్రభుత్వం ఎంత ఖర్చుపెట్టవలసి

వస్తోంది? ఉదాహరణకు, పదేళ్ల క్రితం IAMR చేసిన సర్వేలో తేలిన విషయం-ఒక IIT విద్యార్థి మీద సంవత్సరానికి రూ. 12,000 ఖర్చవుతోందని. యిప్పుడైతే, అదే సుమారుగా ఒక విద్యార్థికి సంవత్సరానికి రూ.50,000 వరకు ఉంటుంది (CRS Rao & A K Pal)

ఇంత ఖర్చుతో కూడిన మేధావుల వలసవల్ల వచ్చే విదేశీమారకం కన్నా, అరేబియా, కువైట్ వంటి దేశాలకు డ్రైవర్లు, తాపీ పనివారుగా(మేధావి వర్గం కానివారు) వలస వెళ్లే వ్యక్తుల ద్వారా వచ్చే విదేశీమారకం లాభదాయకం. ఎందుకంటే, ఆయా వ్యక్తుల ఉత్పత్తికి మన ప్రభుత్వం, మేధావుల ఉత్పత్తికంటె ఖర్చు పెట్టేది తులనాత్మకంగా చాల తక్కువ.

వలస వెళ్లిన మేధావులు తిరిగి స్వదేశానికి వచ్చినప్పుడు వారివల్ల అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం దిగుమతి కాగలదు. అయితే, వలస వెళ్లిన మేధావులు కొన్ని సంవత్సరాల తర్వాత తిరిగి వచ్చేనాటికి వారు సంపాదించిన సాంకేతిక నైపుణ్యం స్వదేశ కాలమాన పరిస్థితులకు సరిపోకపోడం గాని, దేశపరిస్థితులు ఆ పరిజ్ఞానానికి తగినంతగా ఎదగకపోవడంగాని జరిగే ప్రమాదముంది.

## మేధావులవలస-నియంత్రణ మార్గాలు

మేధావుల వలసను నియంత్రించేందుకు దీర్ఘకాలిక పరిష్కారాలు కొన్ని, సత్వర చర్యలు కొన్ని చేపట్టాలి. మన నైతిక విలువలను పెంపొందించుకోవడం, లంచాలను పారద్రోలడం, వంటివి దీర్ఘకాలిక పరిష్కారాలు. ''అధికాదాయ వర్గాల వారి ఆదాయ స్థాయిలను తగ్గించే ప్రయత్నం మేధావుల వలసకు అవకాశం కల్పిస్తుంది. మన నాయకత్వం నూతన విలువలకు నిజాయితీతో ప్రాధాన్యత ఇస్తే మన విద్యాధికులు, మేధావుల్లో అధికులు తప్పకుండా ప్రభావితుల వుతారు....మన సమాజంలో వ్యాపించిన తప్పుడు విలువల మూలాన్నే మేధావుల వలస జరుగుతోంది. పూర్వం సంపన్నులు పేదరికం, దారిద్ర్యం తాండవిస్తున్నప్పుడు సంపన్న జీవితం అనుభవించడం నామోషీగా భావించేవారు. ఈనాటి మేధావుల్లో ఆమాత్రం సామాజిక స్పృహ, చైతన్యం అయినాలేదు. ఈ స్థితిని మార్చకపోతే మేధావుల వలస సాగుతూనే ఉంటుంది. పైగా విదేశాలలోని భారతీయులకు అధిక ప్రాధాన్యత యివ్వడం, దేశంలోనే ఉండిపోయినవారిని బుద్ధిహీనులుగా, చేతకాని వారుగా పరిగణించడం మన సమాజంలోని వక్రతల్లో ఒకటి...''(ప రాంజపే).

ప్రతిభావ్యుత్పత్తులకు మంచి గుర్తింపు నివ్వాలి. మేధావులు వారి ఉద్యోగాలలో రాణించడానికి కావలసిన అవకాశాలు కల్పించాలి, దీనికై చక్కని పని చేసే వాతావరణమేర్పర్చి, పనిపట్లనైతిక విలువలు (work ethics) ఉత్పన్నమయేలా వ్యవస్థాగతమైన (Institutional infrastructure) మౌలిక మార్పులు చేయాలి. ఈ వలసను అరికట్టే విషయంలో సాంఘిక గౌరవాన్ని (social esteem), వృత్తిలో తృప్తిని (Job Satisfaction) మనం విస్మరించరాదు. దీర్ఘకాలిక వ్యవస్థాగత మార్పులతో పాటు కనీసావసరాలైన యిల్లు, రవాణా, టెలిఫోన్ మొదలైన సౌకర్యాలను కలిగించే సత్వర చర్యలను చేపడితే, శాస్త్రనేత్తలు, సాంకేతిక నిపుణులు వారి బుర్రలను వారివారి పనుల్లో సక్రమంగా కేంద్రీకరించే వీలుంటుంది.

స్వదేశానికి తిరిగి వచ్చే మేధావులకు తగినన్ని వసతి సదుపాయాలు కల్గించి, ఉన్నత స్థాయి (Senior Grade) ఉద్యోగావకాశాల్ని కల్పించడం ద్వారా వారిని ఏవో కొన్ని లేబొరేటరీలకు ఇన్చార్జిగా నియమించి వారి పనిని వారు శాంతియుతంగా చేసుకొనేలా చూసినపుడు వారు మరీ పెద్దపెద్ద జీతాలను ఆశించకపోవచ్చు. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ వంటి దేశాల్లో మనం యిన్స్టిట్యూట్లను స్థాపించినట్లైతే, ఆయా దేశాలకు వలసవెళ్లి స్థిరపడినవారు వాటిలో చేరి భారతీయమైన సమస్యలపై పని చేసే వీలుంటుంది. అంతేకాక అట్టి వారి కొరకు స్వల్పకాలిక దర్శన ఫెలోషిప్పులు (Short term Visiting Fellowships) ఏర్పరిస్తే, వారు యిక్కడకు వచ్చి వారి విజ్ఞానాన్ని, సాంకేతికనైపుణ్యాన్ని వెదజల్లే అవకాశముంటుంది. ఉదాహరణకు, ఖొరానా తిరిగి శాశ్వతంగా రానవసరంలేదు. ఆయన సంవత్సరానికి 2-3 నెలలు వస్తేచాలు. మనం యిక్కడ ఒక మైక్రో బయాలజీ యిన్స్టిట్యూట్ను స్థాపించినట్లైతే, జీతం లేకుండా వచ్చి పని చేయాడానికి ఆయన సంసిద్ధతను తెలియ జేసారు (ఈ విషయాన్ని శ్రీ టీ.కె.కౌల్, అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ దృష్టికి తేవడం జరిగింది. కాని, ఏ చర్య తీసుకోబడిందో తనకు తెలియదంటున్నారు వారు).

అభివృద్ధి చెందిన దేశాలలో స్థిరపడిన భారతీయ మేధావులకు మాతృదేశంలో విదేశీ పరిజ్ఞానంతో పరిశ్రమలు స్థాపించడానికి ఆంక్షలను తొలగించి, ప్రభుత్వపరంగా కావలసిన సహాయసహకారాలు అందించాలి. వలస పోయే ప్రతిమేధావి తప్పనిసరిగా తిరిగివచ్చి స్వదేశంలో నిర్ణీతకాలం పాటు పని చేయాలనే నిబంధన పెట్టాలి. అంతేకాకుండా, మేధావులు విదేశాలకు వెళ్లడమనేది ప్రభుత్వ పరంగా మాత్రమే సాగేలా చేయాలి. శ్రమకు తగిన వేతనాలనిచ్చి, అల్పోద్యోగితను (Under-employment) తగ్గించి తద్వారా మేధావుల అసంతృప్తిని తొలగించాలి. దేశంలో పనిచేస్తున్న శాస్త్రజ్ఞుల జీతాలు పెంచి సౌకర్యాలు కల్పించే చర్యల్ని చేపట్టాలి. అప్పుడు మనం విదేశాలకు వెళ్లిన మేధావులను కొంతవరకు ఆకర్షించడానికి అవకాశం కల్పించుకొన్న వారమౌతాం.

అలాగే, పై చదువుల కోసం విదేశాలకు పోయేవారి వద్ద కూడా, తద్వారా లభించే విజ్ఞానాన్ని స్వదేశాభివృద్ధికి వినియోగిస్తామని లిఖిత పూర్వక హామీ తీసుకోవాలి. అంతేకాక, పై చదువుల కోసం వలస వెళ్లేవారు మన దేశానికి సంబంధించిన సమస్యలపై పరిశోధన చేయాలి. అంతే కాని, యిక్కడనుంచి వెళ్లి, అమెరికాలో కూర్చొని, ఈజిప్టు ఎడారులను గురించి పరిశోధన చేయనవసరం లేదు. అలాంటి మనకు ఉపయోగపడని శోధన ఆ ఎడారి యిసుకల్లోనే యింకిపోయిన వేదన కాగలదు.

ప్రతిభావ్యుత్పత్తులు గలవారిని పెందలకడనే (at an early date) గుర్తించి, వారికి మంచి అవకాశాలను కల్పించి, వారి యొక్క సృజనశీలతను, సామర్థ్యాన్ని పెంపొందించే విధంగా విదేశాలలో శిక్షణ యిప్పిస్తే, వారి శక్తి సామర్థ్యాలు యింకా యినుమడించి జాతికి మంచి జరుగగలదు. శాస్త్రవేత్తలు వారి స్వంత పనిని వారి ఇచ్ఛానుసారం రూపొందించుకొనే (to design) స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందాలి. అలాగే, శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు ఆర్గనైజ్డ్ బాడీగా రూపొంది వారివారి నిరాశా నిస్పృహలను తెలియజేయాలి. అంతే కాకుండా, వారి పని చురుకుగా, సవ్యంగా సాగాలంటే ఎటువంటి వాతావరణం కావలసి ఉంటుందో వారే తెలియజేయాలి.

ఆఖరుగా, బ్రెయిన్ డ్రెయిన్‌ను నియంత్రించడం గాని, పోయిన మేధావుల్ని తిరిగి రప్పించడం గాని పూర్తిగా అయ్యేపని కాకపోయినా, నిజమైన ప్రతిభను గుర్తించి, వారు ఆయా రంగాలలో అభివృద్ధి సాగించడాని కనువైన అవకాశాలను కలిగించినపుడు ఈ వలస తగ్గే అవకాశముంది. అయితే, ఈ బ్రెయిన్ డ్రెయిన్ అనేది మౌలికంగా మేధావుల వలసవల్ల ఏర్పడినది కానేకాదు. ఇది ఆర్థిక రంగాభివృద్ధిలోను, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని వివిధ వర్గాల (Sectors) మధ్య సమన్వయం లోపంలోను, అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాల మధ్య కొట్టొచ్చినట్టు కనబడే ఆర్థిక వ్యత్యాసాలలోను బాగా వ్రేళ్లు వేసుకుని ఉంది. అభివృద్ధి చెందుతున్న దేశాలు, చెందిన దేశాల యొక్క సాంఘికార్థిక స్థాయి చేరుకొన్నప్పుడే ఈ మేధావుల వలస పూర్తిగా నివారింపబడగలదు.

## References:


1. మూకినీడి సూర్యభాస్కర్, శాస్త్ర సాంకేతికాభివృద్ధి - యుగ యుగాలుగా భారతదేశం, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక, జనవరి' 92, PP. 101-6.
2. సైన్స్ నాలెడ్జ్ (జనెటిక్ ఇంజనీరింగ్), Part IV, జమ్మి కోనేటిరావు, భార్గవి బుక్ లింక్స్, విజయవాడ, IEd, 1985, PP. 38-39.
3. Prakash, C. Jain, Indians Abroad; a current Population Estimates, EPW No. 8, Feb. 20, 1982, PP. 199 - 203.
4. C.R.S. Rao, & A.K. Pai. India's Abroad Register (Registration during 1982), Tech. Manpower, Bull, Div. Scien & Tech, Personnel, CSIR, XXV, Jan 1983, No. 1.
5. H.K. పరాంజపే, భిన్నమైన - ప్రత్యామ్నాయ పంథా, తెలుగు, నవంబర్, 1989, P.P. 59-64.
6. T.N. Kal. We can tackle the Brain - drain problem, message as ex-member, Executive Board, UNESCO.
7. Brain Drain & UNESCO: Message from Amadov - Mahtar M. Bow. Director General, UNESCO, Paris.
8. J. Bhagawati et al,. Taxing Brain - drain, North Holland, 1970.
9. Brain-drain Taxation, World Bank's Report on world Development, P. 102.
10. T.G K. Namboodhri, Letter to Editor, Science Today, Jan 1986.




(ఇంటర్వ్యూ ఊహాజనితం)

# రామలింగారెడ్డితో మధురవాణి

– పురాణం సుబ్రహ్మణ్యశర్మ

రెడ్డిగారు చుట్ట నోట్లో పెట్టుకోగా మధురవాణి అగ్గిపుల్ల ముట్టించి నవ్వుతుంది.

**మధురవాణి :** అడగవచ్చునా? మీరు పెళ్లి చేసుకోలేదేమి?

**సి.ఆర్. రెడ్డి:** మార్కెట్లో పాలు విరివిగా దొరుకుతూండగా నేను వేరే ఆవుని కొని మెయిన్‌టైన్ చేయనేల?

**మధురవాణి :** అలా మీ పెద్దలు అనుకుని వుంటే - (నవ్వి)

**సి.ఆర్. రెడ్డి:** నీకేమి? నా బ్రహ్మచర్యంవలన యిబ్బంది కలగలేదు గదా!

**మధురవాణి :** కలగవచ్చు. మొదటి నుంచీ దొరతనం చేసిన సంస్కారం కలవారు గనుక,

**సి.ఆర్. రెడ్డి:** ఆ గనుక -

**మధురవాణి :** స్వాతంత్ర్య ప్రీతి, ఔదార్యం, మానాభిమానాలు, ఆజ్ఞా భంగాన్ని సహించని అధికారం యివి మీవంటి రెడ్లకు సహజంగా వెన్నంటిన చిత్తప్రవృత్తులు. రజోగుణం మీ మూల ప్రకృతి -

**సి.ఆర్. రెడ్డి:** కనుక్కున్నావు గద

**మధురవాణి :** మహాభారతంలో మీకు ఎక్కువ యిష్టమైనది దుర్యోధన పాత్ర -

ఉక్కరి సురపతికైనను
మ్రొక్కము; నృప ధర్మమూది మొన తలబడినన్
మిక్కిలి పేరును నిట, దివి
నక్కజముగ బెంపు బడయనగుట నుపేంద్రా.

**సి.ఆర్ రెడ్డి:** ద్రౌపది గూడ నాకిష్టమైన పాత్ర. నేనెప్పుడైనా వివాహం చేసుకుంటే ఆ వచ్చిన భార్య ద్రౌపది వంటి రాజసం గల మనిషైతే దాని ముందర నా రాజసం ఎందుకూ చెల్లక పోతుందేమోనని; మరి నేను పెండ్లే చేసుకొనక ఆ పరీక్షకు అవకాశము కలిగించలేదు.

**మధురవాణి :** ద్రౌపదివంటి స్త్రీ ఎందుకనుకున్నారు? భానుమతి వంటి పతివ్రత రాకూడదా మిమ్మల్ని వరించి.

**సి.ఆర్. రెడ్డి:** నేను రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారికి హితబోధ చేశాను.

**మధురవాణి :** ఏమని ?

**సి.ఆర్. రెడ్డి:** నీవు కూడా పెండ్లి చేసుకొని భార్యా బంధంలో చిక్కుకొని స్వరూప నాశనం చేసుకోవద్దయ్యా అని.

**మధురవాణి :** శర్మగారేమన్నారు ?

**సి.ఆర్. రెడ్డి:** మీ ఉపదేశం కాలాతీతంగా వచ్చింది. మరి మీకున్న భయమూ నాకు లేదన్నాడు.

**మధురవాణి :** ఊహ్ ద్రౌపదితో పేచీ పడ్డారు. సరే యిది విన్నారా ?

రెడ్డీ! నీ కవితా విమర్శన విధా శ్రీలే కథా క్లుప్తి వే
రొడ్డైన్ మార్గము పూర్వలాక్షణికు లుద్యోగంబు సద్యోగమై
యొద్ధారించిన నీవచోలతికలం దుయ్యాల జంపాలలై
యుడ్డీ నాకృతులైరి సూరన కవీంద్రోక్తి ప్రబంధాంగనల్

**సి.ఆర్. రెడ్డి: నాది పూర్వలాక్షణికుల మార్గం యెందుకైంది ?**

**మధురవాణి :** ఏ మార్గమైనా మీరు కావ్య భాష అంటే గ్రాంథికమే రాశారు అవునా? లండన్ వెళ్ళొచ్చి పాశ్చాత్య దేశాలలో చదువుకుని యింటికొచ్చి గ్రాంథిక భాషలో మీ భావాలు వెల్లడించడం ఏం సబబు?

**సి.ఆర్. రెడ్డి:** నా సాహిత్యమునకు నా తండ్రియే యధిదేవత. మాది కవిపండిత వంశము. పైగా కుప్పుసయ్యంగారు మాకు గురువు. ఎనభై ఏళ్ళ వారు. ఆయన మా క్లాసుకు అత్తరు పూసుకుని వస్తే 'ఏమండీ! మీ క్లాసు ఎంత మంచి వాసనగా నున్నది' అని యొకప్పుడు నేను బొగడగా ''బాలులారా! మాతృభాష యొక్క పరిమళము సుమండీ! మీ యింగ్లీషు.... పోలె దుర్గంధపూరితము కాదు'' అనే వారు. మాకు వ్యావహారికం మొదట్నుంచీ అబ్బలేదు.

**మధురవాణి :** కుప్పుసయ్యంగారంటే సర్వలక్షణ సార సంగ్రహము రాసిన వారేనా?

**సి.ఆర్. రెడ్డి:** అవును. నీకెలా తెలుసు?

**మధురవాణి :** గిరీశం గారు యిది చదవలేక ఎఫ్.ఏ. పరీక్షలో డింకీ కొట్టారట తెలుగులో. ఎప్పుడూ దీన్ని తిట్టుకుంటూ వుండేవారు కోపం పట్టలేక.

**సి.ఆర్. రెడ్డి:** గిరీశానికెక్కడ లొంగుతుంది అది, లొంగదు గాక లొంగదు. కుప్పుసయ్యంగార్లను వారి యనంతరం పండితులుగా వచ్చిన వేంకటకృష్ణమాచార్యులు నేర్పిన దానికంటె నెక్కువ నేను కాలేజీకి వెళ్ళిన తరువాత నేర్చుకోలేదు. ఆ వచ్చిన దానితోనే నా భాషా యాత్రను గడపుచున్నాను.

**మధురవాణి :** మీకీ రామలింగారెడ్డి పేరెలా వచ్చింది?

**సి.ఆర్. రెడ్డి:** నా ముత్తాతగారు కట్టమంచి రామలింగారెడ్డి. నా ఫాల పట్టిక యందలి యొకానొక చిహ్నము భావి పాండిత్య సూచకమని గ్రహించి కుప్పుసయ్యం గార్లు నా ముత్తాత పేరు నాకిడి రట.

---

**మధురవాణి :** మీ ముత్తాత గారి ప్రత్యేకత ఏవిటి?

**సి.ఆర్. రెడ్డి:** మా ముత్తాత రామలింగారెడ్డి గారు కుప్పనయ్యంగార్లకు సంస్కృతాంధ్ర విద్యలను, గొనరుగ జ్యోతిషమును బోధించిన గురువులు.

**మధురవాణి :** మీ తండ్రి గారో?

**సి.ఆర్. రెడ్డి:** భారతము పునః పునః పారాయణము చేయించి నాయందు వారు సాహిత్య రసజ్ఞతను బుట్టించిరి.

నాతండ్రి సుగుణ మణి ఖని
శ్రోత్రియు డురువైభవుండు సుబ్రహ్మణ్యం
డాతత గతి, నాటిన వి
ద్యా తతుల ఫలంబు మీకు నభివేదింతున్.

**మధురవాణి :** మీరు మొదట రాసిన కావ్యం ఏది?

**సి.ఆర్. రెడ్డి:** తొలు దొల్త నేను రచించినది ''ముసలమ్మ మరణము''.

భారత భాగవతోజ్జ్వల
వారధి గత సార పద్య వరమణి చయమున్
హారాలు గట్టె నెవడా
సూరిని మజ్జనకు దలచి చూడుడు నన్నున్

ఒకానొక త్రిలింగ దేశీయునిచే వ్రాయబడి బ్రౌన్ దొరగారిచే బ్రకటింపబడిన 'అనంతపుర చరిత్రము' అనుగ్రంథము నుండి యిందలి కథం గైకొంటిని.

**మధురవాణి :** ఏమా కథ? ఎవరా ముసలమ్మ?

**సి.ఆర్. రెడ్డి:** వాగునకు అడ్డముగా వెళ్ళి నీటిలో మునిగి బలిదానము కావించిన పుణ్యస్త్రీ. ముసలమ్మ ఆమె నామ ధేయం. ఆమె చిన్నదే. పతితో అన్యోన్యముగా కాపురం చేసుకొనే వనిత. ఆ వూరికి ఏటా వచ్చే ముంపునకు ముత్తైదువగా తనని బలి చేసుకున్నది.

**మధురవాణి :** ఆ పుణ్య స్త్రీకి నా నమస్కారం. చాలా మంచి కావ్యం రాశారు. అంతకు మునుపు యిటువంటి సామాన్య స్త్రీల గురించి వారి త్యాగాల గురించి మంచితనం గురించి ఎవరూ వ్రాసి వుండరు.

**సి.ఆర్. రెడ్డి:** 1900 సంవత్సరంలో నా 19వ యేట ఈ ఆధునిక పద్య కావ్యాన్ని 'ట్రాజిడీ' ని రచించాను. ఆధునిక కవిత్వానికి నాది తొలి కావ్యం అనవచ్చు. అనంతపురం దగ్గర బుక్కరాయ సముద్రం అని యిప్పటికీ వుంది. ఆ యూరి చెరువు కట్టకు ముసలమ్మ కట్ట అని పేరు. అచ్చట ఏటేట జనులందరు పొంగళ్ళు పెట్టుచు ముసలమ్మను గ్రామ దేవతగా కొలుచుచున్నారు. ఇది నేను స్త్రీల కొరకు చేశాను.

**మధురవాణి :** ఇదేనా - మీరు స్త్రీల కొరకు యింకా ఏమైనా చేశారా?

**సి.ఆర్. రెడ్డి:** అల్లా అడుగు చెప్తాను. నవయామిని అని ఖండకృతి వెలయించాను. ఇది 1936లో - బిల్హణీయం కథ. ఎంత తెలివితక్కువ రాజైనా యువతీయువకు లకు ఏకాంత సంఘటనం ఎట్టి మూఢులైనా జేకూర్తురా?

**మధురవాణి :** అవును. మూఢులు జేకూర్చరు. (నవ్వు) ప్రేమించుకోడానికి, వలపుకు రూల్సేవిటండీ రెడ్డివర్యా?

**సి.ఆర్. రెడ్డి:** నీకేమి? అంతఃపుర కాంతలకు కొన్ని హద్దులుంటాయి. అవి మీర రాదు.

**మధురవాణి :** ద్రౌపది రాజసానికి భయపడిన బ్రహ్మచారులు మీరు. వలపు దాంపత్యం ప్రేమ యిటువంటి సంగతుల గురించి మీరు తీర్మానాలు చేస్తే నవ్వువస్తుంది.

**సి.ఆర్. రెడ్డి:** పండితుడను, కవిని - మరియు విద్యావేత్తను. ఇంగ్లండులో చదువుకొని వచ్చిన నాకు ప్రేమ గురించి మాట్లాడటానికి అర్హతే లేదా?

**మధురవాణి :** అది యిప్పుడు తేలదు. ఆ విషయం అలా వుంచి - గురువును శిష్యురాంద్రు మోహించటం నీచాతినీచమని మీ అభిప్రాయమా?

**సి.ఆర్. రెడ్డి:** యామినీ బిల్హణుల చరిత్ర-అటువంటిది. నేను వ్రాసిన 'నవ యామిని'కి కొన్ని సవరణలు చేశాను.

**మధురవాణి :** ప్రేమించుకున్న వారు 'నిగ్రహబుద్ధియు శమనశక్తియు నేమాత్రము లేని యట్లు పరస్పర వశులగుటకు బశువులా' అన్నారు మీరు. మీరెవరినీ ప్రేమించి యెరుగరు కనుక పశువులు గానక్కర లేకుండా అదృష్టవశాన తప్పించుకున్నారు.

**సి.ఆర్. రెడ్డి:** ఔరా యేమి నీ వాక్చాతురి? నీకొక తస్సా చెప్పి రంజింప చేస్తాను. కవిత్వం మహా సాహస కార్యమని నా తండ్రికి భయం. విషగణాలుపడి యెవరికి చేటు వాటిల్లునో అని పెద్ద వెరపు. తెనుగులో నాకుండు పాటవం జూసి వీడెప్పుడు కవిత్వ రచనకు ప్రారంభించి నాశనమగునో యని దిగులు చెందేవారు. చనిపోయే దాకా యీ తుంటరి కవిత్వం మొదలు పెట్టి యిల్లు గూలుస్తాడేమో నని మా తండ్రి సంశయించేవారు.

**మధురవాణి :** ఇల్లు కూల్చలేదు. ఇల్లాలు లేకుండా చేసుకున్నారు. అయితేనేమి యింటికి 'పద్మ ప్రభాస' అని కుప్పుసామయ్యరు మేడ్ డిఫికల్ట్ లాటి పేరు పెట్టుకున్నారు.

**సి.ఆర్. రెడ్డి:** పద్మానికి మన సంస్కృతిలో మంచి ప్రాముఖ్యం వుంది. ఆంధ్ర విశ్వవిద్యాల యానికి ఎంబ్లెం చేసినపుడు సూర్యుడు, వికసిస్తున్న అనేకదళపద్మం, ఒక చక్రం, చుట్టూ పాములు 'ఆంధ్ర విశ్వ కళాపరిషత్' అని పేరు 'తేజస్వినా వధీతమస్తు' అని వేదోక్తమైన సూక్తి ఏర్పాటు చేశాను. అదంతా చెబితే నీకిప్పుడు ఏం బోధపడుతుంది?

**మధురవాణి :** అవును. నాలాటి వారివల్ల కంటె మీలాటి చదువుకున్న వారివల్ల యీ దేశం చాలా చెడిపోయింది.

**సి.ఆర్. రెడ్డి:** అలా గిట్టని వారంటారు. ఆంధ్రా యూనివర్సిటీని నేను కేంబ్రిడ్జి నమూనా మీద మలిచాను. తెలుగంటే నాకిష్టమే - కాని దానికి ఎక్కువ ప్రాముఖ్యం యివ్వలేదు. ఉద్యోగాలు కూడా తెలుగువాళ్ళకు యివ్వలేదని నామీద అభియోగం వుంది. నేను ప్రతిభా వ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి అన్నాను.

**మధురావాణి :** విశ్వనాథ సత్యనారాయణ గారిని మీ సంస్థ లోపలికి రానివ్వకుండా జాగర్త పడ్డారట, నిజమేనా?

**సి.ఆర్. రెడ్డి:** ఇంటర్వ్యూలో ఆయన ప్రవర్తన మాకు నచ్చలేదు. మనిషి దగ్గర అణకువ విధేయత లేదు. మీరెవరు నన్ను జడ్జి చేయటానికి అన్నట్లు ప్రవర్తిస్తే -

**మధురవాణి :** మీ రాయన్ను సెలక్ట్ చెయ్యలేదు. పోండి - బతికి పోయాడు. మహాకవులు గుమాస్తాల్లాగుండాలని మీ మతం కాబోలు! మీకు రెడ్డి ఫీలింగ్ ఎక్కువట గదా! (నవ్వు)

**సి.ఆర్. రెడ్డి:** స్వజాత్యభిమానం ఎవరికైనా వుంటుంది.

**మధురవాణి :** సహ కుటుంబం యొక్క అనివార్య లక్షణం ఈర్ష్య. ఎంతపనైనా చేయిస్తుంది?

**సి.ఆర్. రెడ్డి:** ''టైగర్ ఆఫ్ చిత్తూరు'' అని తిరువేంగడసామి నాయుడు చిత్తూరు హైస్కూలు హెడ్ మాస్టర్లందరి కంటె మిన్న. వారి యెడ మా తండ్రికి భక్తి యెక్కువ. భయమంతకంటె రెండింతలు. నాయుడుగారు సర్వంకష ప్రతిభులు. ఇంగ్లీషునందు సంపూర్ణ పాండిత్యము; గణితశాస్త్రములో నసమాన ప్రజ్ఞ; తెనుగు, సంస్కృతము, సంగీతము, వీణ, బెత్తము సెట్లు, ఏదైనను సరే వారు పెట్టినదే బిచ్చము.

**మధురవాణి :** ఆరు నెలల్లో ఆరేండ్ల చదువు సిద్ధం చేసే చిత్తూరి పులి అంటే వీరేనా?

**సి.ఆర్. రెడ్డి:** అవును. వీరి యింగ్లీషు లా లైబ్రరీ అంత పుస్తక భాండాగారం చిత్తూరు బియ్యేబియల్ లు ఎవరూ సేకరించలేదు.

**మధురవాణి :** మీ తండ్రిగారి గురించి చెప్పేది పూర్తి చేయలేదు. చిత్తూరు పులివద్ద మీ నాయనగారు మేక (నవ్వు)

**సి.ఆర్. రెడ్డి:** మా తండ్రి గారు తొలుత పిత్రాచారమును బట్టి గుమాస్తా పనిలో దిగిరి. కొన్ని యేండ్లకు జిల్లా కోర్టు రికార్డు కీపరైరి. ఆ పనికి రాజీనామా యిచ్చి కార్వేటి నగర సంస్థానములో మేనేజరుగా జేరి అక్కడి రాజుల విపరీత రాజసం తట్టుకొనలేక దానిని వదలి ఫస్టు గ్రేడు ప్లీడరు సన్నదును సంపాదించుకొని వకీలు వృత్తి నాశ్రయించి దానికిని తనకు నసాధారణమైన కీర్తి తెచ్చిరి.

**మధురవాణి :** మీ నాయన గారు మామిడి పళ్ళను సృష్టించే వారట గదా కొత్త రకాలు -

**సి.ఆర్. రెడ్డి:** జడ్జి కాలేటు దొరగారి పట్ల కృతజ్ఞతతో రెండు మామిడి రకములు ఒకటి 'కాలేటు పసందు' రెండవది 'రాబర్టు పసందు' అని పేర్లు పెట్టారు.

మధురవాణి : మీ తండ్రిగారు సౌజన్యారావు పంతులుగారి వలె న్యాయవర్తనులట గదా.-

సి.ఆర్. రెడ్డి: కార్వేటి నగరంలో అందరి కోసం మా తండ్రి గారు సత్రం నడిపే వారు. క్లయింట్లు అక్కడ భోంచేసే వారు. రెండవది ''శ్రమ వేతనము కంటె నెక్కువగా గైకొన్నచో అది బిచ్చముతో సమానము'' అనే వారు. నిజమైన వకీలు బిచ్చగాడు కాడు.

మధురవాణి : మామిడి పండ్ల మీద మీ నాయనగారు అథారిటీట కదా -

సి.ఆర్. రెడ్డి: మా తండ్రి గారికి దైవభక్తి యెక్కువ. దానితో పాటే ఛాందసములు కూడా.

మధురవాణి : చిన్నప్పుడు మేనమామల యిళ్ళవద్ద మీకు భోగంవాళ్ళు తలంటు పోసి జుట్టు దువ్వి బట్టలు తొడిగి ముద్దు చేసే వారట నిజమా?

సి.ఆర్. రెడ్డి: పల్లెటూళ్ళలో ఆ భోగాలు మాకుండేవి. నేనప్పటికి చాలా చిన్నవాణ్ని.

మధురవాణి : పెద్దయ్యాక కూడా అవన్నీ చేయించు కోవాలని వుందా? నేనే ఆడదాన్నయితే మీతో లేచిపోయి వుండే దాన్నని వెంకటచలంగారు మీ పర్సనాలిటీని అందాన్ని ఠీవిని పొగడుతూ ఎక్కడో ఎవరితోటో అన్నారట.

సి.ఆర్. రెడ్డి: నువ్వన్నది కాంప్లిమెంటా, విమర్శా?

మధురవాణి : మీరు పెళ్ళి చేసుకోలేదు కాని బ్రహ్మచారి కాదని ఆస్థానకవి సమ్మానసభలో చెళ్ళపిళ్ళవారు వేళాకోళం చేశారని విన్నాను. ఔనా?

సి.ఆర్. రెడ్డి: నేను జవాబు చెప్పే ప్రశ్నా యిది? వేంకటశాస్త్రి గారికి జంట కవిత్వం అలవాటు. సమ్మానం రోజున నా అధ్యక్షోపన్యాసం సాగుతున్నంత సేపూ శాస్త్రిగారు పద్యాలు చదువుతూ ఏదో కామెంట్సు విసురుతూనే వున్నారు.

మధురవాణి : ఆస్థానకవికి మేనర్సు లేదని చిరాకుపడి వుంటారు మీరు.

సి.ఆర్. రెడ్డి: లేదు. జంట కవిత్వం అలవాటు కదా. అది మానలేకుండా వున్నారన్నాను.

మధురవాణి : మీరు మాంసాహారా? శాకాహారా?

సి.ఆర్. రెడ్డి: మ్రానను రాలనుం గలదె
మాంసము ప్రాణుల మేనగాక య
మ్మేనుల నొంచునట్లు తమ
మేనుల సోకిన మాత్రనెట్లగున్
దానిఁ దలంపగా వలదె
తానదిమానిన హింసలన్నియున్
మానవెయంచు నుత్తముఁడు
మాంసము మాను దయార్ద్ర చిత్తుడై

అని భారతమున విని మాంసాహారము మానిన జీవహింస మానునని మా తండ్రి దానిని విసర్జించెను.

**మధురవాణి :** మీ గురించి అడిగితే మీరు మీ నాయనగారి గురించి చెబుతారేమి? మీకు తండ్రి అనగా వల్లమాలిన ప్రేమ భక్తి గౌరవం వున్నట్లున్నది.

**సి.ఆర్. రెడ్డి:** అవును. మా తండ్రిగారు ప్రచురించిన గ్రంథములు రెండు. భారత సార రత్నావళి, భాగవత సార ముక్తావళి. దాని జోలికి పోవడం ప్రమాదమని సొంత కవిత్వం చెప్పలేదు.

**మధురవాణి :** మీరు మద్రాసు క్రిస్టియన్ కాలేజి రోజులనాటి నుంచి కవిగా విమర్శకునిగా యెదగలేదని కొందరు అంటారు. దానికే మంటారు?

**సి.ఆర్. రెడ్డి:** నాకు ఇరవై యేళ్ళు రాకుండా కళాపూర్ణోదయం గురించి సవిమర్శక స్టడీ చేశాను. ముసలమ్మ మరణం సంగతి యిది వరకే చెప్పాను. ఒక అర్థ శతాబ్దం పాటు పుస్తకాలకు పరిచయాలు ఉపోద్ఘాతాలూ రాస్తూ గడిపాను. అడపా దడపా కొంత కవిత్వం గిలికాను. కొన్ని వ్యాసాలు చెదురు మదురుగా రాశాను.

**మధురవాణి :** మీవంటి పెద్ద విమర్శకుడు కవినుంచి యింతేనా వచ్చింది?

**సి.ఆర్. రెడ్డి:** విద్యావేత్తగా, కొంతకాలం రాజకీయాలలో గడిపాను. అంటే నా జీవితం వృథా అనా నీ ఉద్దేశం?

**మధురవాణి :** రామ రామ - మీ సామర్థ్యానికి తగ్గ వ్యుత్పత్తి లేదని అంటున్నారు విజ్ఞులు.

**సి.ఆర్. రెడ్డి:** చదువుల సరస్వతి నా కొంప తీసింది. ఐతే నా కవిత్వ తత్వవిచారము మాటేమిటి? దాన్తోనే సాహిత్య విమర్శకు పునాదులు పడ్డాయి, కొలదిగా అభిప్రాయ భేదాలున్నా.

**మధురవాణి :** కళాపూర్ణోదయంలో మీ నిర్ణయాలు లేదా అంచనాలు కొన్ని సత్యదూరాలని మన సాహిత్యాన్ని వేరే కళ్ళద్దాలతో కొలవగూడదని డా. జి.వి. కృష్ణారావు గారు ప్రతివిమర్శ చేశార్ట గదా -

**సి.ఆర్. రెడ్డి:** నా కంటె నా తరువాత తరానికి విమర్శలో కొన్ని సుళువులూ సుఖాలూ వుంటాయి. మన వెనుక తరంవారి కంటె మనం ముందుంటాం. మన ముందుతరం వారు మన్ని దాటి వెళ్ళి మనకు ముందుంటారు. అది సహజం.

**మధురవాణి :** 'ఎడ్డె రెడ్డి కుల మదేమని తెలుపుదు' అన్నాడు వేమన. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారి చేత వేమన ఉపన్యాసాలు రాయించేరు. వేమన రెడ్డి అనా?

**సి.ఆర్. రెడ్డి:** కాదు. వేమన 'నువ్వు దైవంతో ఒకడుగా ఏకం కావాలంటే ముందు మనిషితో ఏంకా కావా'లన్నాడు. భగవాన్ శ్రీరామకృష్ణ కూడా 'నేను తక్కువ కులాలన్నింటి కంటె తక్కువ కులం వాడి'నని చెప్పుకున్నాడు. కుల తత్వాన్ని కులాన్ని అతను ఖండించాడు. తెలివి లేనివాడు దేవుడెట్లాయెరా అని అన గలిగిన వేమన అంటే నాకు ప్రాణం.

**మధురవాణి** : మీకు బ్రాహ్మలంటే కోపమా? వేమన దృష్టిలో -

**సి.ఆర్. రెడ్డి**: అటువంటి దేమీలేదు - బ్రాహ్మణ అపరాధాల మీదనే నా దృష్టి

**మధురవాణి** : మనం ఆంధ్రులం సంస్కృతంతో ఆర్యులతో ఎక్కువ అనుబంధం పెంచుకున్నాం - దక్షిణాది తమిళ సాహిత్యంతో ఎందుకు మమేకం కాలేదు?

**సి.ఆర్. రెడ్డి**: అదే నా చింత. తెలుగు సాహిత్యాన్ని పూర్వం బ్రాహ్మలంతా ఆక్రమించారు. డామినేట్ చేశారు. అశ్వఘోషుని బుద్ధచరిత్ర ఎలాగో వచ్చింది. వీరశైవ కవులయిన నన్నెచోడుడ్ని పాల్కురికి సోమనాథుడ్ని మరుగున పడనిచ్చారు. సంస్కృతం నుంచి కావ్యాలు నాటకాలు మళ్ళీ మళ్ళీ తెలుగు చేశారు. కాని తమిళ సాహిత్యం నుంచి 'మణిమేఖలై' వంటి అద్భుత రసమయ కళాఖండాన్ని తెలుగువారు అందుకోలేకపోయారు. తమిళ మహాగ్రంథం పెరియ పురాణాన్ని తెలుగు చేసుకోలేదు. తమిళం నుంచి మనం తీసుకొనకపోవడం గొప్ప అపరాధమే.

**మధురవాణి** : మీరు తమిళులకి తెలుగులకు వంతెన కట్టలేక పోయారా?

**సి.ఆర్. రెడ్డి**: మావేపు అనగా చిత్తూరు జిల్లాలో 'ఏమిరా కంబ రామాయణము మాట్లాడుతున్నావు' అనే వాడుక వున్నది. పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు కంబ రామాయణము తెలుగు చేసి తమిళులకు మనకు చెరగని తరగని వారధి కట్టినాడు. విపరీతమైన దీర్ఘ వర్ణనలు యిందుండేవి. కావ్యాలలో 'శిలప్పదికారము'ను మించిన కావ్యం వుండడం అసంభవం. తెనుగులో మణిమేఖల, శిలప్పదికారానికి సమానమైన రచనలు లేవు. తేవారములు, శ్రీ ఆండాళమ్మ పాశురాలు మనకు ఆలస్యంగా వచ్చాయి.

**మధురవాణి** : బాగుంది. తమిళ టైగర్లతో కాకుండా తమిళ సాహిత్యంతో మనం బాగా పొత్తు పెట్టుకోవాలి. రంగనాథ రామాయణాన్ని మీరే కదా వెలికి తీసింది?

**సి.ఆర్. రెడ్డి**: రంగనాథరామాయణాన్ని పరిష్కరింపజేసి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు చేత ప్రచురింప చేసాను. వేటూరి ప్రభాకరశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, గన్నవరపు సుబ్బరామయ్య, పింగళి లక్ష్మీకాంతం వంటి దిగ్గంతులు యీ రామాయణం మీద పని చేసారు.

**మధురవాణి** పింగళి కట్టమంచి వారల పీఠికల్ని ఘాటుగా రాళ్ళపల్లి వారు 'భారతి'లో విమర్శించారట గదా!

**సి.ఆర్. రెడ్డి**: రంగనాథుడనే కృత్రిమ పురుషునికి ఈ గ్రంథ కర్తృత్వం ఆపాదించారు. గోన బుద్ధారెడ్డి రచన. ఇందులో అవాల్మీకాలు చాలా వున్నాయి. ఆర్య ద్రావిడ సంఘర్షణ గురించి కూడా యిందులో వుంది.

**మధురవాణి** : మొత్తానికి ఇంగ్లండులో చదువుకుని వచ్చి కూడా మీరు కథ 'నవల' ఆధునిక కవిత్వం వైపు మొహం కూడా తిప్పలేదు. వ్యావహారిక భాషా వుద్యమానికి

మీ చేయూత లేనేలేదు. వేష భాషల్లో ఆధునికులుగాని మీరు గొడ్డు గ్రాంథిక వాదులూ సనాతనులే - కన్యాశుల్కం మీకు నచ్చడం గురజాడ వారి అదృష్టమే -

**సి.ఆర్. రెడ్డి:** ఏమా కొంటె తనము?

**మధురవాణి :** మరిచాను మీరు 1930లో ఆంధ్రా యునివర్సిటీ V.C. కి రాజీనామా చేసారట నిజమా! కారణము?

**సి.ఆర్. రెడ్డి:** బ్రిటీషువారి అమానుష చర్యలకు నిరసనగా చేసాను.

**మధురవాణి :** మరి ఆ కుర్చీని ఎవరాక్రమించారు?

**సి.ఆర్. రెడ్డి:** సర్వేపలి రాధకృష్ణ

**మధురవాణి :** మనదేశ ప్రసిడెంటు రాధాకృష్ణ పండితుడా! ఎహ్వె

(ముగింపు వచ్చే సంచికలో)

## "Summit to Save the Earth"

"Saving the planet has never been an issue of money, but rather a matter of the resourcefulness and motivation of individuals"

Spencer Peepe
*President of Ecotrust*

When asked to comment on the import of Coca-Cola and lipstick, our Finance Minister said that "this old thinking... that steel is more important than consumer goods... is the root of India's problems."

Coca-Cola should gladden the hearts of all those below the poverty line. They will have this delicious drink instead of water. Marie Antoinette of France would be delighted (hope she is in heaven) to hear this. Remember she had asked her subjects to eat cake if there was no bread. - Yours, etc., S. R. NANDA (Col., Retd). New Delhi.

# శృంగార రసము

- చీమకుర్తి శేషగిరిరావు

## రస వివేచన

రసములను గురించి చర్చించుటలో శృంగార రసమును తొలుత భరతుడు పేర్కొని వివరించెను. రసములన్నింట ప్రముఖము శృంగారము అని ఈ విధముగ ఆ శాస్త్రము ధ్వనింపజేసినది. నాట్యశాస్త్ర వ్యాఖ్యాతయగు అభినవగుప్తుడు ఈ నిర్ణయమును సమర్థించుచు ఇటులనెను: ''సకల జీవజాతులందు కామము కనవచ్చుచున్నది. అందరకును అది హృద్యము. కావుననే శృంగారము నాట్యశాస్త్రమున తొలుతగ పేర్కొనబడినది.'' భోజుడు ఇంకొక అడుగు ముందునకు పైచి శృంగారము ఒక్కటియే ప్రకృతి రసము (మూల రసము) అని ప్రతిపాదించెను. కొందరు దీనిని కాదనిన వారును కలరు. భవభూతి కరుణము మాత్రమే ప్రకృతి రసమనెను. కాని అత్యధికులు శృంగారమునే రసరాజముగ గ్రహించిరి.

ఈ విశ్వము సృజింపబడ, నిరంతరముగ చైతన్యముతో ప్రవర్తిల్లుటకు శృంగార రసమే కారణము. జీవరాశి, నశించకుండ ప్రత్యుత్పాదనము జరుగుటకు శృంగార రసమే ఆధారము. ఆ విధముగ చూచినపుడు శృంగార రసము, జైవిక మగు ఒక ఆవశ్యకత (Biological necessity) గ సుస్పష్టము. అందువలన 'రసరాజు' అను నామము దానికే తగియున్నది. ఈ విషయమును లెస్సగ గ్రహించిన అభినవ గుప్తుడు శృంగార రసమునుండియే తక్కిన రసములు రూపొందిన తీరుతెన్నులను తన వ్యాఖ్యయందు విశదపరచెను. శృంగారమునకు స్థాయి భావము 'రతి'; దానివలన రూపొందిన జీవలోకము తన ధర్మసాధనకై వ్యవహరించు రీతులవలన – ఉల్లసన, పోషణ, రక్షణాదులకై సాగించు పనుల వలన – హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స అద్భుతములు క్రమముగ రూపొందుటను ఆయన అచట వివరించెను.

శృంగార రసమునకు భరతుడు నాట్య శాస్త్రమున ప్రథమ స్థానమును కల్పించుటకు ఆ శాస్త్ర రచనాకాలపు సామాజిక స్థితియు కొంతవరకు కారణమైనది. భరతుడు వివరించిన రీతిలో శృంగార రసమును అర్థము చేసికొనుటకు ఈ సామాజిక పరిస్థితిని మనము ముందుగ తెలిసికొనవలసియున్నది.

ఇదివరలో చెప్పబడినటుల, పుష్యమిత్రుని వలన క్రీ.పూ. 187లో వైదిక మతమునకు రాజాదరణ లభించినది. యజ్ఞములకు, తదనుబద్ధములగు ఆచారములకు గౌరవము ఏర్పడినది. కాని ఈ మార్పు తొలుతగ కొన్ని పై వర్ణముల వారిలో- క్షత్ర ధర్మమును అవలంబించిన వారిలో - మాత్రమే తావును ఆర్జించినది. తక్కిన వారిలో బౌద్ధమే విపుల ప్రచారముతో మనినది. అందువలననే ఆనాడు వైదిక ధర్మమును ఆదరించిన రాజుల – శుంగ, కాణ్వ, సాతవాహనుల – కాలములో సైతము విస్తృత స్థాయిలో సాంచీ మొదలగు తావులందు మహాస్తూప, విహారాదులు రూపొందగలిగినవి. ఇట్టి కట్టడముల నిర్మాణములకు వైదికులగు రాజులు సైతము దానములను ఇచ్చి సాయపడిరి. ఇట్టి పరిస్థితి ఏర్పడుటకు గల కారణము

లను ఈ విధముగ వివరింపవచ్చును: బుద్ధుడు ప్రవచించిన నైతిక మార్గము అత్యుత్తమమని ఆనాటి వారందరును విశ్వసించిరి. కాని అహింసపై బౌద్ధమతము వహించిన పట్టుదల వలన, క్షత్రియ లోకము దేశరక్షణ యందు తగు శ్రద్ధ వహింపకుండుటచే, దేశము శకయవనాదుల ఆక్రమణకు లోనగుచున్నదని కొందరు పై వర్గముల వారు భావించిరి. తత్ఫలితమే పుష్యమిత్రుడు తెచ్చిన వైదికమతోద్ధరణ. దీనివలన చాతుర్వర్ణ్య వ్యవస్థ దేశమున పటిమను పొందినది. ఆయా వర్ణ ధర్మములను నిర్దేశించుచు - సంఘ వ్యవస్థను కాపాడు తలంపుతో – మనుస్మృతి ఆ కాలమున రూపొందినది. బ్రాహ్మణుడు ధర్మరక్షణకై ఏ వృత్తినైనను అవలంబించవచ్చునను దానిని అనుసరించి, పుష్యమిత్రుని వంటి బ్రాహ్మణులు సైతము అప్పటికే క్షత్ర ధర్మమును అవలంబించి దేశరక్షణలో క్షత్రియులతో కలసిమెలసి వ్యవహరించిరి. కాని తక్కిన వారిలో విరివిగ వ్యాప్తిలో ఉన్న బౌద్ధమతమును నశింపజేయుటకు వారు పూనుకొనలేదు. బుద్ధుడు బోధించిన నైతిక సూత్రములు సామాన్య పౌరులలో అమలునందుండుటవలన సంఘమునకు శ్రేయమే గాని నష్టము ఉండబోదని వారు భావించిరి. అట్టి నైతిక సూత్రములను వైదిక స్మృతులు కూడ ఆదరించినవి. మానవ లోకము సుఖలాలసతకు లోనై భ్రష్టము కాకుండ తగు కట్టుదిట్టములను, బౌద్ధులవలెనే, వైదిక స్మృతులును విధించినవి. నట గాయకులను దేశారిష్టకారులుగ స్మృతులును, నిర్దేశించినవి. వారిని పంక్తిబాహ్యులని మనుస్మృతి నిషేధించినది. ఈ విధముగ ఒక విధమగు సహజీవనము కొంతకాలము బౌద్ధ, వైదిక మతముల మధ్య కొనసాగినది.

కాని కాలక్రమమున వీని మధ్య గల వైరుధ్యము ముందునకు వచ్చినది. 'సర్వమ్ దుఃఖమ్ దుఃఖమ్' అనునది బుద్ధదేవుని నాలుగు ఆర్య సత్యములలో తొలుతటిది. ఇట్టి దుఃఖమునకు కారణము తృష్ణ. అన్నింట కామతృష్ణ చాలగ వినాశజనకము. దానిలో విజ్ఞుడగువాడు చిక్కుకొనకూడదు – అని బౌద్ధుల బోధ. కాని ''కామేచ్ఛ, జీవములందు సహజము. ఆహార నిద్రల వలెనే అదియు సర్వ సామాన్యము. దానిని వర్జించుట సాధ్యమగునా'' ఇట్టి సందేహము ఆ కాలపు సమాజమున, ఆ సహజీవన యుగమున, యువక లోకమును ఆందోళితము చేసినది. క్రీ.శ. ఒకటవ శతాబ్దికి చెందిన వాడుగ సంభావితుడగు అశ్వఘోషుడు అను బౌద్ధకవి రచించిన 'సౌందరనందము'న ఇట్టి ఘట్టమే మనలను ఎదుర్కొనును. బుద్ధుని బోధనను అనుసరించి పరివ్రజ్య (భిక్షుక ధర్మము)ను నందుడు అను యువకుడు స్వీకరించును. కాని యౌవన సహజమగు కామము అతనిని వీడదు. ఈ పరిస్థితిని ఆ మహాకవి రెండు శ్లోకములలో అతి రమ్యముగ వర్ణించెను. అవి:

స కామరాగేణ నిగృహ్యమాణో ధర్మానురాగేణచ కృష్యమాణః
జగామ దుఃఖేన వివర్త్యమానః ప్లవః ప్రతిస్రోత ఇవాపగాయాః

తా. కామరాగము అతనిని వెనుకకు లాగుచుండెను; ధర్మానురాగము ముందునకు లాగుచుండెను. వాని ఫలితముగ అతడు నదీ ప్రవాహానికి ఎదురుగా పోవ యత్నించు పడవ వలె వెనుకకు తిరిగి చూచుచు ముందునకు పోయెను.

అటులనే –

తం గౌరవం బుద్ధగతం చకర్ష భార్యానురాగః పునరాచకర్ష,
సో ఽనిశ్చయాన్నపి యయౌ నతస్థౌతరం స్తరంగేష్వివ రాజహంసః

తా. బుద్ధదేవునిపై తనకున్న గౌరవము అతనిని ముందునకు లాగినది; భార్యానురాగము అతనిని వెనుకకు లాగినది. ఈ విధముగ అలల మధ్య రాజహంస వలె – అతడు వెనుకకు గాని ముందునకు గాని పోలేక - ఉండెను.

ఆ నందుని స్థితిలో ఉండినది ఆనాటి భారతీయ యువక లోకము. ఆ పరిస్థితి నుండి గట్టెక్కు మార్గము గుప్తరాజుల కాలపు పండిత వర్గము నిర్దేశింప గలిగినది; ఆ వర్గము వైదిక మతమునకు ఒక క్రొత్త రూపమును కల్పించినది. దానిని మనము పౌరాణిక సంప్రదాయమని వ్యవహరింపవచ్చును. దీనికి ఆస్తిక్యము, దైవభక్తి ఆలంబనాలు. దీనిని అనుసరించి మానవుడు పరమ సుఖార్థియై నాలుగు విధముల పురుషార్థములను – ధర్మము, అర్థము, కామము, మోక్షము అనువానిని - సాధించవలెను. వీని సమన్వయమే మానవ జీవిత లక్ష్యము. కావున ఇట్టి పురుషార్థ సాధనలో ఒక ఘట్టమే కామము లేదా శృంగార రస నిష్ఠ. అట్టి శృంగారమున గర్హింపదగినది ఏదియును లేదు.

ఇట్టి అభిప్రాయములను లోకమున చక్కగ వ్యాపింపజేయుటలో సంగీతమును, నాట్యమును చక్కగ సహకరింపగలవని ఆనాటి పండితులు భావించిరి. అదివరకే మహాయాన సంప్రదాయపు బౌద్ధులు సంగీత నాట్యములను తమ సిద్ధాంతముల వ్యాప్తికై వినియోగించుకొనుచుండిరి. దానినే గుప్తకాలపు పౌరాణిక సంప్రదాయము వారును అనుకరించిరి. కాని అంతకు పూర్వమే వైదిక స్మృతులు నట, గాయకులను గర్హించినవి. అట్టివారికి సంఘమున గౌరవము కల్పింపవలసి వచ్చినది. నాట్యశాస్త్రమున తొలి అధ్యాయమునను, చివరి అధ్యాయమునను ఈ యత్నమే కానవచ్చును. నాట్యము బ్రహ్మచే దేవలోకమున రూపొందింపబడి శంకరునిచే ఆమోదితమై, లోక సంగ్రహార్థమై భూలోకమున రాజసభలలోనికి దిగి వచ్చెనని అందలి [illegible] లోనికి తెచ్చిన భరతాదులు ఋషులు. ఆ నాట్యశాస్త్రమున రస చర్చలో ప్రముఖముగ పేర్కొనబడిన శృంగారము [illegible] నాట్యశాస్త్రము నటగాయకులకు ధార్మిక రంగమున ఒక మాననీయ ప్రతిపత్తిని, శృంగారమునకు సముచిత గౌరవమును కొనిరాగలిగినది.

## విభావ, అనుభవ, స్థాయి భావాలు :

నటులు వివిధ రీతుల అభినయాల వలన రసనిష్పను సామాజికులందు (ఆ నాట్యమును చూచువారిలో) కల్పించుటను వివరించునది ఈ నాట్యశాస్త్రము. అందులకు అనుగుణముగ కరణములు, దృష్టులు మొదలగు వానిని ఆ శాస్త్రము వివరించెను. రసములను గురించిన సామాన్య చర్చలో వీనిని కొనిరావలసిన అవసరము లేదు. కాని రస నిష్పత్తిని విశ్లేషించుటలో భరతుడు కొనివచ్చిన విభావ, అనుభావ, స్థాయి భావములను ఇట్టి చర్చలో తప్పక అర్థము చేసికొనవలసియున్నది.

ఒక రసభావము ఏర్పడుటకు సాయపడు లేదా కారణములగు కాలము, వ్యక్తి, ప్రకృతి పరిసరాలు మొదలగునవి విభావాలు. వాని వలన ఒక వ్యక్తియందు కలుగు చూపులు, నడక మొదలగునవి అనుభావాలు; ఒక రసభావము పరిపక్వత చెంది ఆస్వాదింప వీలగునట్టి స్థితి 'స్థాయి' భావము– అని స్థూల రీతిలో నిర్వచింపవచ్చును. తక్కిన రసములకు వలెనె శృంగార రసమునకును విభావ, అనుభావ, స్థాయి భావములను భరతుడు తెలియజేసెను.

శృంగార రసమునకు భరతుడు తెల్పిన విభావములును, అనుభావములును సార్వకాలీన ములని కాని సార్వజనీనములని కాని అనుటకు వీలులేదు. విభావములలో విదూషకుని కూడ అతడు చేర్చెను. ఆతని దృష్టి రాజాస్థానముల వరకే పరిమితమగుట వలన అట్టిది అతనికి ఆవశ్యకమై ఉండియుండును. అందువలన మనము ఈ విభావములను సార్వజనీన దృష్టిలో ఇప్పుడు అన్వయించుకొనవలసి ఉన్నది.

శృంగార రసపు ఉత్పత్తికి కాలము హేతువు కాగలుగుట అందరెరిగినదే. శారీరకముగ యౌవన సమయము అందులకు మూలకారణము. ఇక ఋతువులలో వసంతము, వర్ష ఋతువు, శరదృతువు మొదలగునవియు అందులకు దోహదము చేయును; మేఘాడంబరము మగ నెమలికి ఉత్సాహము కల్గించును; అంతట అది తన జోడును ఆకర్షించుటకై యత్నించును. ఇక కొన్ని విధములగు పరిసరములును రసోత్పత్తికి సహకరించును. ఆయా దేశముల ఉనికి, ఆయా వ్యక్తుల జీవిత విధానములచే ప్రేరితములై వ్యక్తి శారీరక చర్యలలో కన్పట్టునవి అనుభవాలు. ఇవి కూడ వివిధ రీతులలో దేశకాల, జీవిత విధానముల ననుసరించి వివిధములుగ ఉండును. తన జోడును ఆకర్షించుటకై నెమలి పురివిప్పి, చక్కగ నృత్యము చేయును. మానవులందు నడక, చూపు, లజ్జ, చొరవ, మాటాడురీతి మొదలగు వానిలో ఆ అనుభావములు ప్రస్ఫుటాలగును. శృంగారమునకు 'రతి'ని స్థాయిగ భరతుడు పేర్కొనెను. ఇది త్రికాలీనమగు సత్యము.

శృంగారమును భరతుడు సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము అను రెండు రీతులుగ వింగడించెను. ఇది లోక వృత్తమునకు అనుగుణమైనదియే. రెంటి యందును కోరబడిన స్థాయి రసము 'రతి'యే కాని సంభోగ శృంగారమున అది చక్కగ పర్యవసించును; రెండవ దానిలో ఆ శృంగారము, ఎడారిని చేరి ప్రవహింప యత్నించు నదివలె అంతర్లీన మగును.

ఈ రెండు విధముల శృంగారము శ్రవ్య కావ్యములలోనికిని తరువాత చొరబారినది. కాని ఇట్టి వాని కార్యక్షేత్రము దృశ్య కావ్యముల కన్న వేరైనది. వీనిలో నటకుల దృష్టులకు, అభినయాలకు అవకాశమే ఉండదు. అందువలన మాటల వలననే విభావ, అనుభావములను విశదములు చేయవలసివచ్చినది. ఇక ఈ కృషిలో భరతుడు పెట్టిన రాజాస్థాన సంప్రదాయ మునే సంస్కృత కవులు చాలగ ఆదరించిరి. తెలుగున ప్రబంధ కవులును వారినే అనుసరించిరి. ఈ విధముగ వచ్చి చేరినవే మన కావ్యములలో కన్పట్టు విరహ లక్షణాలు – చంద్రుని, వెన్నెలను, మలయ మారుతాన్ని తిట్టుట, శైత్యోపచారాలు మొదలగునవి. ఇట్టి వర్ణనలను ఒకనిని మించి వేరొక కవి సాగించగా, కడకు అవి లోక వృత్తమునకు కడు దూరములై పాఠకులు వానిని విశ్వసించలేకుండు స్థితికి వచ్చినవి. ఇట్టి స్థితికి దిగజారిన శృంగార రస చిత్రణను, లోక వృత్తమునకు కొంత దరిదాపులలోనికి తెచ్చుటకు యత్నములు జరిగినవి. అట్టి కృషిచేసిన వారిలో తెలుగునకు సంబంధించినంతవరకు పేర్కొనదగిన ప్రముఖకవి పింగళి సూరన. అతడు రచించిన 'కళాపూర్ణోదయము'న శృంగారరసపు తీరుతెన్నులను తెలియజేయు ఘట్టములు వివిధ రీతులవి కలవు. వానిలో ప్రముఖముగ పేర్కొనదగినది సుగాత్రీ శాలీనుల వృత్తాంతము.

శాలీనుడు ఒక సామాన్యుడు. నాగరికుడు కానే కాడు. ప్రకృతి ఒడిలో పెరిగిన వాడు. అతనికి పెండ్లి యైనది; ఇల్లటపు అల్లుడయ్యెను. పెండ్లి కూతురగు సుగాత్రిని చక్కగ సొమ్ములతోను, వేషములతోను అలంకరించి మగని గదిలోనికి పంపిరి. అతనిని ఆమె ఏ విధముగను ఆకర్షింపలేక పోయినది, విఫల యత్నమైనది. కడకు అతనిని, ఒక తోట పనివాడుగ అత్తగారు నియమించినది. ఆ తోట వర్షము వలన ఒక దినమున బాగుగ దెబ్బతిన్నది. ఆ పరిస్థితిలో తోటను చక్కపెట్టి పనిలో భర్తకు సాయము చేయుటకై, సొమ్ములను ఆవలనుంచి, పైటను నడుము చుట్టు బిగించి, సుగాత్రి పూనుకొన్నది. అపుడు ఆమె ఆచరించిన రీతి కవి వాక్యాలలో:

సీ. తోరంపుఁ జనుదోయి త్రుళ్ళింతల నిడంగఁ
  తగు చోట్ల గుద్దంటఁద్రవ్వి త్రవ్వి
ప్రేఁగైన పిఱుఁదు బల్విడిఁజలింపంగను
  వడి నిట్టు నట్టును నడచి నడచి
యదుసు తుంపురు చెక్కుటద్దంబులను బర్వ
  మళ్లకు మడవలు మార్చి మార్చి
నడుము లేఁదీవియ నకనకల్ గుడువ, నిం
  పునఁ దగు మోపులు మోసి మోసి

తే. చిఱు చెమటఁ బేర్చు వింత క్రొమ్మెఱుఁగు తోడఁ
గొమరు మేనొప్ప, సారెకుఁ గొప్పు కదల
నేమిటికి నైనఁదా మున్న యేఁగి యేఁగి
యెల్లపనుల నొనర్చె నింపెసక మెసఁగ.

సుగాత్రి తన సహజ రీతిలో సాగించిన ఈ పనులలోని సొబగు శాలీనుని ఆకర్షించినది. అంతట అతడు ఆమెను కౌగిలిలో చేర్చి మదన మహారాజ్యపు ఆనందమున మునిగెను. ఈ శృంగార ఘట్టము, సాంప్రదాయిక కావ్యకర్తల భావనలకు అందనిది. ప్రకృతి సహజమగు రమణీయత కలది.

భరతుడు ప్రవచించిన సంభోగ శృంగార, విప్రలంభ శృంగారములకన్న విభిన్నమైన శృంగారమొకదానిని కళాపూర్ణోదయమున సూరన చిత్రించెను. అది శల్యాసురగాథ. తనను చంపవచ్చిన వాడెవడైనను తనచేత చచ్చునట్టి వరమును శల్యాసురుడు పొందెను. అతడు అభినవ కౌముదిని గాఢముగా ప్రేమించెను. కాని ఆమె తిరస్కరించినది. అంతమాత్రమే కాదు; కత్తిని ఒకదానిని తీసికొని అతనిని ఎదుర్కొన్నది. అతడంతట పరుగిడెను. ఆ పరుగిడినది ప్రాణభయమున కాదు; తనను చంపవచ్చిన అభినవ కౌముది - తనకు ఉన్న వరపు బలిమి వలన - చనిపోవునేమో అని అతని భయము. ఆమె యొక్క యిష్టదైవతములపై ఒట్టు పెట్టి పదే పదే అతడు ప్రార్థించును. ''ఈ పనికి పూనుకొనవలదు; నీవు అందువలన చనిపోగలవు; ఆ దుఃఖమును నేను భరించలేను'' అని ఘోషించును. శృంగారమున ఇందు కరుణ మేళవించినది. శల్యాసురుని అమాయికపు ప్రేమ మనకు జాలిని కల్గించును. తన యాపదను లెక్కించక, తాను ప్రేమించిన యువతి క్షేమమే ఆకాంక్షించెడి స్వార్థత్యాగమును ఇందు గర్భితము. ప్రాచీనులలో కొందరు పేర్కొనిన కరుణ శృంగారమునకు ఇది యొక చక్కని లక్ష్యము.

శృంగారము ఒక విచిత్రపు రసము. అది ప్రేమకు పరాకాష్ఠ. ప్రేమ అనునది ఒక ఆకర్షక శక్తి. ఈ శక్తి ఇరువురిమధ్య పనిచేసినపుడు, వారిరువురను ఏకము చేయుటకు అది యత్నించును. కౌగలించుకొనుట, ముద్దిడుకొనుట వంటివి ఈ యత్నమునకు చెందినవే. ప్రేమకు పరాకాష్ఠయగు శృంగారమున ఈ యత్నము ప్రగాఢతను పొందును. ప్రేమికులు ఒకరు వేరొకరిని తనవానినిగ, తనలోని వానినిగ తీసికొనుటకు యత్నించును. అది కౌగిలింతలు, ముద్దులతో ఆగక, దంతక్షత, నఖక్షతముల వరకును పోవును. ఆయా మానసిక స్థితులను అనుసరించి కొందరియందు ఒక విధపు హింసా ప్రవృత్తిని ప్రేరేపును. ఇట్టి హింసయందు ఒక విధపు ఆనందము ఉత్పన్నమై ప్రేమికులను ఇరువురిని కరగించును.

ఆధునిక యుగమున తెలుగున పలువురు ప్రముఖుల రచనలలో శృంగారము స్థానమును ఆర్జించినది. అందు కొందరు శృంగారమును పైవర్గముల వారి సాంప్రదాయికతనుండి విడవరచి పల్లెపట్టులకు కొనివచ్చుటకు యత్నించిరి. అట్టివారిలో ప్రముఖుడు నండూరి సుబ్బారావు. అతడు రచించిన 'యెంకి పాటలు'లో శృంగారము ఒక క్రొత్త సొగసును సంతరించుకొన్నది.

ఏతమెత్తేకాడ ఎదురూగ కూకోని
మళ్లీ ఎప్పటల్లే తెల్లారబోతూంటే
చందురుణ్ణీ తిట్టు నా యెంకి,
సూరియుణ్ణీ తిట్టు నా యెంకి

పూర్వపు కవి సంప్రదాయాలలో నాయిక చంద్రుని ఉపాలంభించుట (తిట్టుట) కానవచ్చునే కాని సూర్యుని తిట్టుట సాధారణముగ కానరాదు. కాని యెంకి ఉన్న పరిస్థితిలో అది సముచితము.

ఇక ఈ యుగముననే కొంతకాలము భావకవిత్వము అనునది రాణించినది. దానిని ఆశ్రయించిన కవులు పూర్వపు సంప్రదాయములకు తిలోదకములు ఇచ్చినను, ఊహాలోకపు ప్రణయినిని ఒక దానిని సృజించుకొని ఒక క్రొత్తరకపు అవాస్తవికతను పోషించిరి. ఇక కొన్ని నవలలును శృంగార రసపోషణలో పాలుపంచుకొనినవి. వానిని అన్నిటిని చర్చించుటకు ఇట అవకాశము లేదు. మొత్తము మీద ఈ ఆధునిక యుగపు తెలుగురచనలు చాలవరకు ఆంగ్ల సారస్వతముచే ప్రభావితాలు.

## పాశ్చాత్య సాహిత్యము – శృంగారము:

శృంగారము సార్వజనీనము. కావున అందు తూర్పు - పడమర దేశముల ఉనికిని బట్టి మార్పేమియు ఉండదు. కాని ఆయా దేశాలలోనివారి అభిరుచులను, కొన్ని స్థానిక సంప్రదాయములను అనుసరించి రచనలలో శృంగారమును వ్యక్తీకరించుట యందు కొన్ని ప్రత్యేక లక్షణాలు కన్పడును. పాశ్చాత్య సాహిత్యములలో ఆంగ్లభాషా సాహిత్యములతోనే, భారతీయు లకు పరిచయము లభించినది. సంస్కృతమునందలి 'శృంగార' పదమునకు సరియగు పదము ఏదియు ఆంగ్లమున కన్పడదు. లవ్ (Love) అను ఆంగ్ల పదము మన భాషలోని 'ప్రేమ'కు సరికుదురునది. శృంగారము ప్రేమమయమే అగును కాని ప్రేమ యనునది అంతయు శృంగారము కాదు. ఇందువలన ఈనాటి ఆంగ్ల పండితులు కొందరు 'శృంగార' అనుదానికి సరికుదురుటకై 'ఏరోటిక్ లవ్' (Erotic Love) అను పదబంధమును ఉపయోగించు చున్నారు.

పాశ్చాత్యభాషల సాహిత్యములకు అన్నింటికిని స్ఫూర్తిని ఇచ్చినది ప్రాచీన గ్రీకు సాహిత్యము. సంస్కృత నాటకరచయితలు శృంగార, వీర రసములనే ప్రధాన రసములుగ గ్రహించి రూపకములను, కావ్యములను సుఖాంతములుగ చేసిరి. గ్రీకు పండితులు దుఃఖాంత రచన లను సుఖాంతములకన్న ఎక్కువగ ఆదరించి పోషించిరి. అందువలన శృంగారమునకు సంబంధించినంతవరకు కరుణ-శృంగార, విప్రలంభ శృంగార రచనలే అందు ఎక్కువ. ఈ సంప్రదాయమునే ఆంగ్లాది పాశ్చాత్య భాషలు అనుకరించినవి. లోకవృత్తమునకు కొంతదూరముగ నుండు అవాస్తవికత ఆ రచనలందును కలదు. శృంగార విషయమున, ప్రాచీన భారతీయ రచయితల వలెనే, పాశ్చాత్య రచయితలును భూమిని విడిచి ఆకసమున ఒక ఊహా ప్రపంచమున విహరించిరి. అందువలన సుప్రసిద్ధ ఆంగ్లకవి షేక్‌స్పియర్ - కవిని, ప్రేమికుని, ఉన్మత్తుని ఒకే కోవకు చెందినవారుగ చిత్రించెను. ఆధునిక యుగపు పాశ్చాత్య రచయితలు శృంగార చిత్రణయందలి అవాస్తవికతను తగ్గించి, వాస్తవికతకు చేరువలో ఉంచుటకు యత్నించిరి. కాని ఆ యత్నములో వారు శృంగారమునందలి ఉదాత్తతను కూడ లోపింపజేసినటుల కన్పడుచున్నది. ఈ 'శృంగార'ము పాశ్చాత్యులలో ఫ్రాయిడ్ వంటి మనస్తత్వ శాస్త్ర పండితులను సైతము ఆకర్షించినది. అతని సిద్ధాంతముల వలన 'శృంగారము' ఉదాత్తతను పొందినదా? లేక వక్రీకృతమైనదా? అనుట వివాదస్పద విషయము. శృంగారమున కర్కశత లేదా హింసేచ్ఛ (ప్రేమించిన వ్యక్తిని కర్కశరీతిలో హింసించుట) అనునది వదలవీలులేని ఉత్ప్రేరకము అను భావనను కొందరు అవలంబించిరి. దాని ప్రవక్త మార్క్విస్ డి సాడీ అను ఫ్రెంచి రచయిత. అతని పేరనే ఈ వాదము 'సాడిజమ్' అని వ్యవహృతము. ఈ తీరుగ వ్యాప్తిని చెందిన పలు పాశ్చాత్య రచనలచే చాలవరకు ప్రభావితమగుచున్నది తెలుగున నేటి శృంగార చిత్రణ.

## అర్థరహితమగు అమలిన శృంగారము

ఈ వ్యాసమును ముగించుటకు ముందుగ 'అమలిన శృంగారము' అనుదానిని గురించి కొంత చెప్పుట తప్పనిసరి. తెలుగు సాహిత్యమున మాత్రమే కననగునది ఈ పదబంధము. పాశ్చాత్య సాహిత్యమున ప్రచారముపొందిన ప్లేటోనిక్ ప్రేమ (Platonic Love) అనుదానిని దృష్టియందుంచుకొని దీనిని రూపొందించి యుందురు. కాని ఈ అనువాదము అపార్థజనకము. 'ప్లేటో' అనునతడు గ్రీకు తాత్త్వికుడు. సోక్రటీస్ అను తత్త్వజ్ఞుని శిష్యుడు. తన గురువునకు సౌందర్యమును గురించి ఉండిన అభిప్రాయాలను ప్లేటో వివరించుచు శృంగారపు ప్రసక్తిని తెచ్చి ఒక గ్రంథమున వివరించెను. అతని అభిప్రాయమున ''మనకు వేద్యమగు వస్తు ప్రపంచమున సర్వే సర్వత్ర ఉన్నది ఒకే ఒక భావన (Idea); అదియే ఉచ్చతమమగు సౌందర్యము. దానితో ఐక్యము చెందుటకు పండితుడు యత్నించును. అందులకు ప్రేమయే సాధనము. కాని ఈప్రేమ నిష్కామమై ఉండవలెను. 'Eros' (శృంగారము) సకామము; కావున అది శృంగారముకన్న వేరైనది, అతీతము అగుప్రేమ.''

కావున ప్లేటో వివరించినది మన తాత్త్వికులు తెలిపెడు 'సత్' పదార్థమే అగును. దానికి సంబంధించిన దానిని మన పండితులు 'పరమప్రేమ' అన్నారేకాని శృంగారము అనలేదు. కావున ప్లేటోనిక్ ప్రేమను అమలిన శృంగారము అని తెల్పుట పెద్దపొరపాటు. శృంగారమున మాలిన్యమే ఉండదు. శృంగారమే మాలిన్యమయమైనచో ప్రపంచమున మాలిన్యమయము కానిది ఏది ఉండగలదు? రస రాజమగు శృంగారము మలిన రహితము, పవిత్రము, విశ్వసృష్టికి, విశ్వచేతనకు ఏకైకాధారము.

(శేషము)

# MILESTONES

**May 18, 1953**

Aldous Huxley takes mescaline for the first time, and writes *The Doors Of Perception* as a result.

**May 19, 1958**

Harold Pinter's *The Birthday Party* opens in London and is a disaster.

**May 20, 1946**

W.H. Auden becomes an American citizen.

**May 21, 1688**

Alexander Pope is born in London.

**May 22, 1859**

Sir Arthur Conan Doyle is born in Edinburgh.

**May 24, 1940**

Joseph Brodsky is born in Leningrad; he is expelled from Russia in 1972.

**May 25, 1908**

Theodore is born in Michigan.

**May 26, 1917**

W. Somerset Maugham aged 43 marries 37-year-old Sylvie Wellcome, mother of his 18-month-old daughter Liza.

**May 28, 1908**

Ian Fleming is born in London.

**May 29, 1906**

T.H. White is born in Bombay, India.

శ్రీ శ్రీ

జననం 15-4-1910

మరణం 15-6-1983

**June 8, 1809**

Thomas Paine dies in obscurity in New York.

**June 9, 1870**

Charles Dickens dies.

**June 10, 1915**

Saul Bellow is born.

**June 11, 1925**

William Styron is born in Virginia.

**June 12, 1929**

Anne Frank is born in Germany: she begins her dairy 13 years later on her birthday in 1942.

**June 13, 1865**

W.B. Yeats is born in Dublin.

**June 14, 1811**

Harriet Beecher Stowe, author of *Uncle Tom's Cabin,* is born.

**June 19, 1936**

Maxim Gorky dies allegedly poisoned by internal enemies of the Soviet regime.